# ప్రతి గురువారం



రచన

జే. యస్. మెక్లిన్

అనువాదం

ఎన్. ఆర్. చందూర్

N. R. Chandur



ప్రతిమా బుక్స్

49 మూకతాల్ స్ట్రీ

మద్రాసు – 7

PRATI GURUVARAM

Protima Books, Madras 7

April 1955



Telugu Translation of Jane S Mc Ilavaine's "...appens Every Thursday". Copyright 1951. Abridged from the book in the author's own words and translated and published by Permission of the author and the publisher The Curtis Publishing Company.



ముద్రణ:

శ్రీ రామా అండ్ కో. - భారతమాత ప్రెస్

11 అండర్సన్ వీధి, మద్రాసు - 1

ఈ పుస్తకం గురించి

మెక్లెవిన్ దంపతులు చాలా మంచివాళ్ళు. వార్తా పత్రికొకటి ప్రచురించాలని వారు ఎన్నో కలలు కన్నారు. ఆఖరికి, డవ్‌సింగ్‌టవున్‌లోని ఆర్క్యూబ్ అను పాతపత్రికని కొని, దానిని పునరుజ్జీవింప జేసేందుకు కంకణం కట్టుకుంటారు. వార్తలకోసం వేట, వివాదగ్రస్తమైన సంపాదకీయాలు, అప్పులు, పిల్లలు, ప్రెస్ గొడవలు - మొత్తంమీద ఒక మనోజ్ఞమైన గాథ. స్వేదబిందువులకి కన్నీటిబిందువులకి తోడు కమ్మగా నవ్వగలగడం, చేస్తున్నపనిలో అకుంఠిత విశ్వాసం - ఇవే వారిని ఉత్తేజపరుస్తాయి. ఇదంతా, ఇరుగూ, పొరుగూ, ఇళ్ళవాళ్ళూ; రకరకాలైన రసమయ సన్నివేశాలుగా - ఒక్క ముక్కలో చెప్పాలంటే, ప్రెస్సూ ప్రింటింగూ అంటే ఏమిటో తెలియనివాళ్ళని కూడా ఈ కథ ఎంతో ఆనందపరుస్తుంది. విస్తారమైన అమెరికాదేశమూ, - దానికను ప్రజలకి జీవితంపట్లవుండే అకుంఠిత విశ్వాసమూ ఇందులో అగుపిస్తాయి.

## ఈ రచయిత్రి గురించి:

ఈమె డవునింగ్ టవున్ లోని ఆర్క్యయివ్ పత్రికకి సహాయసంపాదకురాలు (Co-Editor). ఆపత్రికకి ప్రొప్రయిటర్, ఎడిటరూ, పబ్లిషరూ అన్నీ ఆమె భర్త. జేన్ యడ్వర్టయిజ్ మెంటులు దగ్గిరనుంచి మరణవార్తలదాకా రాస్తూండేది. యడ్వర్టయిజ్ మెంటులకి వెళ్తున్నప్పుడు. పిల్లలిద్దరినీ వెంటేసుకు కూడా వెళ్ళేది. ఈ రచయిత్రి రచనలుకొన్ని "శాటర్ డే ఈవెనింగ్ పోస్టు" పత్రికలో వచ్చాయి. 1949 లో పెన్సిల్వేనియా పత్రికా రచయిత్రుల సంఘం. ఈమె రచనా నైపుణికి ప్రత్యేక బహుమతి యిచ్చింది. మెక్లవిన్ సతి చిన్న పిల్లలకని రెండు చక్రవర్తి గ్రంథాలు రాసింది. ఆ రెండు గ్రంథాలూ జూనియర్ లిటరరీ గిల్డ్ వారు ఆమోదించారు.

పత్రికాభిప్రాయాలు :

''ఊరు చిన్నదైనకొద్దీ విమర్శ తొందరగా వస్తుంది. చేసేది మంచి పనైనా మెచ్చుకునేందుకు వ్యవధి పడుతుంది. కాని, సంఘదృష్ట్యా అది చాలామంచిది. చిన్నపట్టణాలలోనూ, చిన్నమనుషులలోనూ, వున్న పెద్దంతరం,—ఆబహు విశాలత్వం.—ఈరచనకి అందాన్ని ఆకర్షణని సమకూర్చింది''

—వర్జీనియా కిర్కస్

''ఆర్థర్ క్రోక్ ఈ పుస్తకానికి చక్కటి పరిచయ వాక్యాలు రాశారు. తాము ఏది మంచిపని అనుకుంటారో, అందుకోసం ఉత్సాహోత్సాహాలతో కష్టించి పనిచెయ్యడం, ఆ కార్యనిర్వహణాలోని అందచందాలూ శ్రమదమాలూ చెబుతుంది మెక్లవిన్ సతి. ఆమె ఉత్సాహం ఆమెతో ఆగదు.—మనక్కూడా అంటుకుంటుంది. ఈ పుస్తకం చదవడమంటే, ఒక అపూర్వానుభూతిని పొందడమే.''

—జోయన్నా స్పెన్సర్
న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూనల్‌లో

ముందుమాట

యుద్ధకాలంలో తప్పనిసరిగా విడిపోయి, యుద్ధానంతరం మళ్లీ యిల్లువాకిలీ అంటూ ఏర్పరుచుకున్న ఒక అమెరికను దంపతులు, పదిమందికీ ప్రయోజనకరంగా వుండే జీవితాన్ని, అది కష్టభూయిష్టమైనప్పటికీ, ఎలా నిర్మించుకున్నదీ ఈ కథ చెబుతుంది. జేన్ రాబిన్సన్ లు, తమతోటి వారందరికి మల్లే ముళ్లులేని బాటమ్మట హాయిగా నడకసాగించవచ్చు. కాని, వారు ఏరికోరి, ఒక పాత పత్రికను పునరుద్ధరించడానికి పూనుకున్నారు. మహానగరాలకి దూరంగా ఒక మారుమూలనా అంటే. అదీకాదు. పెద్ద పత్రికలవారి పెద్ద పత్రికలది. తమది చిన్నవూళ్లో చిన్నపత్రిక – అంటూ చిరునవ్వుతో ఒక ఉత్కృష్ట కార్యానికి పూనుకున్నారు. ఆ కార్యనిర్వహణలో వారికి సంతోషమూ తృప్తి కలిగాయి. ధనంతోటీ, కీర్తి తోటీ కొలవడానికి వీలుగాని విజయం వారిది. అది యావజ్జీవ కఠినశిక్షే కావచ్చు – కాని ఆశిక్షని వారు సంతోషంగా స్వీకరించారు.

``చిన్న వారపత్రికొకటి కొనగల అవకాశం నాకు లభించగానే, ఈవుద్యోగం వొదిలేస్తాను.'' ఆ స్వప్నంగురించి రాబిన్సన్ ఎన్నివందలసార్లు, ఎన్నివేలసార్లు తల పోశాడో! సంపాదకుల ఆఫీసులోకివెళ్లినప్పుడూ, రిపోర్టర్స్ రూములో

కూడానూ, తన వ్రాతబల్లదగ్గిరా — ఆ స్వప్నాన్ని ఎంతగా మననం చేశాడో! మెక్లవిన్ దంపతుల అనుభవం మనకి ఏం చెబుతోందంటే. అటువంటి కల నిజమయేందుకు పట్టుదలా ఆత్మవిశ్వాసమూ కావాలని.

రాబిన్సన్ మెక్లవిన్ ఆర్కాయివ్ పత్రిక కొనే వేళకి అతని దగ్గిర వున్న డబ్బు బహుస్వల్పం; భారమంతా భవిష్యత్తుమీద వేశాడు. ఎంతటి ఓటమిలోనూ సహనం కోల్పోని చిరునవ్వే అతని సంపద. డబ్బుకంటె ఆశాకిరణాల్ని నమ్ముకోవడం మంచిదని ముందుకి వురికాడు. "మనలో చాలామందికి మనం జీవించని జీవితమే నిజజీవితం," అంటాడు ఆస్కార్ వైల్డ్. "అందరికీ" అని అనలేదు: "చాలామందికి" అన్నాడు. ఆ "చాలామంది"లో ఈ దంపతులు ఒకరు కారు. తమకి ఏం కావాలో వారికి తెలుసు; మళ్లీ అన్ని కష్టాలుపడుమన్నా నిక్షేపంగా పడతారు. అది తప్ప మరొకటి చెయ్యాలని వాళ్లకిలేదు. వారి జీవితమే అందుకోసం.

చిన్న పత్రికలవారి కథ యిది. అష్టకష్టాల్లోకూడా వీరు నెమ్మదిగా ముందుకి సాగగలరు. "చిన్నపత్రిక ఎడిటర్కి (country editor) తన తోడివారి సమస్యలపట్ల నిజమైన సానుభూతి వుండాలి. దయాంతఃకరణతో అందరిపట్లా

అనురాగం చూపించగలగాలి. ద్వేషపూరితంకాని ఆసక్తితో అన్ని విషయాలూ ఆకళింపు చేసుకోవాలి'' అంటుంది జేన్ మెక్లవిన్ ఈ పుస్తకంలో. అవన్నీ ఈ దంపతులలో కనిపిస్తాయి.

మానవ స్వభావ ప్రతిబింబితాలు మహానగరాలు మాత్రమే కాదు-మారుమూల గ్రామాలుకూడాను. రంగస్థలం పెద్దదైనా చిన్నదైనా జీవన్నాటకం మట్టుకు ఒకే స్థాయిలో నడుస్తుంది. అందుకు నిదర్శనం ఈ పుస్తకం. మన సారస్వతానికి మణిపూసలాంటి గ్రంథాన్ని సమకూర్చింది ఈ రచయిత్రి.

వాషింగ్టన్ — ఆర్థర్ క్రోక్

జూన్, 1951

# I

ఇప్పుడనుకుంటాను: ఆ చేపలగోడవే లేకపోతే, నేను రాబిన్సన్ని పెళ్ళిచేసుకునేదాన్నికాను, ఎడిటర్నయ్యే దాన్నికాదు— ఈ పుస్తకం రాసివుండేదాన్నికాదు.

చేపలు పట్టడమంటే నాకు మహాచిరాకు. 1938 జూన్లో చూశాను బాబ్ని మొట్టమొదటిసారి. అప్పటికి చేపలగురించిగాని పెళ్ళిగురించిగాని నామనస్సులో ఏమాత్రం లేదు; పత్రికలగురించి ఏమి తెలుసునంటే, మిల్క్ బాటిల్ (పాలసీసా)తో పాటు వార్తాపత్రికకూడా గుమ్మందగ్గరకొచ్చి వుంటుందని.

నాకప్పటికి పద్ధెనిమిదేళ్లు. వివాహధర్మమనేది ప్రతి కుటుంబంలోనూ వున్నదే! బాబ్ కనిపించేదాకా, మొగాళ్ళంటే ఏమిటో ఏమిటో, అనుకునేదాన్ని.

అదీగాక పెళ్ళిచేసుకు స్థిరపడ్డానికి పూర్వం నేను చూడవలసిన స్థలాలువున్నాయి. వంటాగింటా శాస్త్ర అభ్యసించి, యిల్లూగిల్లూ సద్దుకోడం నేర్చుకు ఆపైన పెళ్ళిచేసుకుందా మనుకున్నాను.

విధి, నన్నుచూసి, నవ్వివుండాలి. వర్జీనియాలోని

మిడిల్‌బర్గ్‌లో మా స్నేహితులింట్లో ఫ్రెండగా ఒకతను వచ్చాడు. సన్నగా, పొడుగ్గా, రాటుదేరిన మనిషిలా వున్నాడు. పదార్థచైతన్యాలు రెండూ ఈమనిషిలో వున్నట్టున్నాయే - అనిపించింది.

ఆ సాయంత్రమయే వేళకి, పెళ్లికి పూర్వం నేను చూడామనుకున్న స్థలాలసంగతి మర్చిపోయాను; ఏమైనా సరే, బాబ్‌ని పెళ్లి చేసుకోవాలనుకున్నాను.

మేఘాలమీద ఆలోచించి, నిముషాల్లో నిశ్చయానికొచ్చాను. బాబ్‌లాటివాణ్ణి మనస్సులో కట్టేసుకోవడం మాటలుకాదు. అతని వయసు 27. వాషింగ్టన్‌లోని రిపబ్లికన్ నేషనల్ కమిటీకి ఉపాధ్యక్షుడు. వివాహమంటే ఏమాత్రం సుముఖత్వంలేని మనిషిలా ఉన్నాడు. అతన్ని పోగొట్టుకోకుండా పట్టుకోవటం ఎలా? మా ఊరు గుర్రాలకి ప్రసిద్ధి. ఆ మాట అతనితో అన్నాను. అతనికి గుర్రాలంటే పరమసహ్యం.

అతన్ని మా ఊరు రప్పించగల ఆకర్షణ ఏమీలేదు గనక, ఏదో పని కల్పించుకుని నేనే వాషింగ్టన్ వెళ్లాలి. లేకపోతే చేతికి చిక్కింది జారిపోదూ?

నువ్వు ఎప్పుడయినా వాషింగ్టన్ వెళ్లావా!—అని

అడిగాడతను. "ప్రతి గురువారం చేపలు తెచ్చుకునేందుకు వెళ్తాను"- అన్నాను.

"ఏం తెచ్చుకునేందుకు?" అని ఆశ్చర్యపోతూ అడిగాడు బాబ్.

"చేపలు"-అన్నాను తడుముకోకుండా, "సముద్రానికి నలభై మైళ్ల దూరంలోనే మేము వున్నప్పటికీ మంచి చేపలు అక్కడ దొరకవు. అందుచేత, వారానికొకసారి, మాకూ మా చుట్టుపక్కలవారికీ కావలసిన చేపలకోసం. నా కారులో వాషింగ్టన్ పోతూంటాను."

"భేష్. చేపలమ్మాయిని యిలాంటి ఆకు పచ్చ షిఫానులో చూడటం యిదే మొదటిసారి - బావుంది! ఈ వారం గురువారం రేవు దగ్గర హోటల్లో లంచ్ వేళ (మధ్యాహ్నపు భోజనం)కలుసుకుందాం. అభ్యంతరమా?"

ఆ విధంగా ప్రారంభమయింది. మర్నాడు పొద్దుటంతా టెలిఫోనుదగ్గర కూచుని, 28 ఆర్డర్లు చచ్చిచెడి సంపాయించి, మేము భోంచెయ్యబోయే హోటల్ కి పక్కనున్న కొట్టువాని దగ్గరవున్న చేపలన్నీ కొద్దిగా ఎక్కువ ధరకైనా సరే నాకు అమ్మేటట్టు ఏర్పాటుచేసుకొని, గురువారం నాడు రేవు దగ్గర ప్రత్యక్షమయ్యాను.

బాబ్ కి చేపలూ అలాంటివి యిష్టమని మొదటిరోజునే

తెలిసిపోయింది. 38 లంచ్ లు ప్రతిగురువారం అలా అయ్యాక, పొదుపుగా గడుపుకుంటే. ఒక్కరికయ్యే ఖర్చుతో యిద్దరు బతకవచ్చునని అన్నాడు బాబ్.

“మనం పెళ్ళిచేసుకున్నామా, యింక మీ గుర్రాల రేసు వెళ్ళడం పడదు. మన హనీమూన్ సముద్రంమీద గడుపుదాం,” అన్నాడు బాబ్.

వెనకోసారి ఒక స్నేహితురాలు యూరోప్ వెళ్తూంటే, ఆమెకి వీడ్కోలు యివ్వడానికి హార్బర్ కి వెళ్లి “నాన్సీలండి” పడవ ఎక్కాను కాసేపు. ఎత్తయిన కెరటాలు పడవకి తగలడం, కెరటాల నురగలు, నక్షత్రాలకాంతి, పైన నీలాకాశం, కింద నీలపు నీళ్లు, అవన్నీ తలుచుకుని ఆనందపడట మొదలెట్టాను - సముద్రప్రయాణం అనగానే. “ఈసముద్రయాన కాలంలో మన దాంపత్యం చెక్కు చెదరకుండావుంటే. యింక ఎన్ని కష్టాలువచ్చినా యిబ్బందిలేదు” - అని బాబ్ అన్నాడు అంతకీ. కాని నాకు అర్థమై ఏడిస్తేగా!

అతను చెప్పింది అక్షరాలా నిజం. యిప్పుడు పిల్లలకి జబ్బుచేసినా, ప్రెన్ పడుకున్నా, బాకీలవాళ్లు యిస్తానని యివ్వకపోయినా - ఆ హనీమూన్ రోజులు తలుచుకుంటాను. ఆ రోజులు తలుచుకోగానే ఈ జీవితం మహా ప్రశాంతంగా కనిపిస్తుంది.

మిడిల్‌బర్గ్‌లో 1939 జూన్‌లో మా వివాహమయింది. వివాహ వేదిక ముందు బాబ్ చాలా కంగారు పడ్డాడు; ఆ కంగారులో కారుతాళాలు పారేసుకున్నాడు. ఏమయితేనేం, ఆ కార్యకలాపం అయిపోయాక వాషింగ్టన్ వచ్చాం. బాబ్‌కి ఆఫ్రికాలో తెలిసిన మనిషొకతను కనిపించాడక్కడ. 1937 నుంచీ వాళ్ళిద్దరూ కలుసుకోలేదట. ఆ కొత్తతను కెన్యాలోని పర్వతాల గురించి నాకు చెప్పగా, ఎంతో శ్రద్ధతో విన్నాను.

మాంచెస్టర్ పడవల రేవులోకి, తిన్నగా కారుని తీసుకువెళ్ళేటప్పటికే, నాకు మనసులో ఎలాగో ఉంది. 37 అడుగుల బోటు అది. దానిని మాకు కొన్నాళ్ళపాటు, వివాహబహుమతిగా సమర్పించారొకరు. బోటు ఎక్కాక నీలపు డ్రెస్ తగిలించాను. నా పని ఎంతకీ తలుపులు తుడవడం నీళ్ళు పారపొయ్యడం. అది ఏమంత ఉత్సాహవంతంగా ఉంటుంది గనక! ''ఆ బకెట్టు యిలాయియ్యి,''—''కిందికి పోయి చీపురు తీసుకురా''— అదే మా సంభాషణ. నేను యింత కోపిష్టిని. దుష్టుణ్ణే పెళ్ళిచేసుకున్నానా? - అనుకున్నాను. అటువంటి చెడ్డమాటలు నేను గుర్రప్పందాలలో కూడా వినలేదు.

చిట్టచివరికి మేము కదిలాం; ''హమ్మయ్య! ఇప్పటికి

కదా ఊపిరి పీల్చుకునేందుకు, టైము దొరికింది''— అనుకున్నాను. మొదటిరోజున ఉదయం ఆరుగంటలనుంచి రాత్రి పదిగంటలదాకా, గాలీ పొగమంచూ, వర్షం లెక్కచేయకుండా ప్రయాణం చేశాం. నాబట్టలన్నీ మంచుతో తడిసిముద్దలై పోయాయి. తర్వాత రెండువారాలూ బాబ్ కాకి పట్లాములు వేసుకున్నాను; స్వెట్టర్ కూడా అతనిదే వేసుకున్నాను.

ప్లిమువుత్ రాక్ దగ్గర మేము చిక్కబడిపోగా, పోర్చుగీసు బెస్తవాళ్లు మమ్మల్ని ఒకదరికి చేర్చారు. ఇంతలో మా బోటు బురదలో కూరుకుపోయింది; నాలుగు గంటల తర్వాత సముద్రపుపోటు వచ్చాక మళ్లీ బయటికి తేలాం.

రెండువారాలపాటు నిద్రాహారాలు సరిగ్గాలేకుండా, మళ్ళా మాంఛెస్టర్ చేరుకున్నాం. బాబ్ కి బాగా గడ్డం పెరిగింది. నేను ఎలావుండేవాణ్ణో అలావున్నా, వేలిగోళ్లు పగిలాయి. నొక్కులునొక్కులు తిరిగే నాజుట్టు అందమంతా చెడిపోయింది. నవ్వితేకూడా నొప్పిపుట్టేటంతగా పెదవులు పగిలాయి. నా నెత్తిమీద ఎనిమిదిసార్లు దెబ్బతగిలింది, నాలుగు వేళ్ళకి కట్టుకట్టుకున్నాను.

" మనకింకా మాటలువున్నాయే," అంటూ యికిలించాడు బాబ్ మహాసంతోషంతో!

# 2

వాషింగ్టన్‌లోని మా రెండుగదుల భాగంచూస్తే ''క్వీన్ మేరీ'' ఓడలాంటిది మా రెండుగదుల భాగంలోని నా స్వస్థతనమేమిటంటే, అది వృష్టినే ఊగిసలాడదు. సముద్రప్రయాణానికి సంబంధించిన సరంజామాగా సామానులుగా అవతల పారేసి, ఇంటిపనులకు పూనుకున్నాను. ఎగిరొచ్చి, బోటులోకిమళ్లీ అక్కర్లేనివన్నీ కిటికీలోనుంచి విసరడానికివీల్లేదిక్కడ. ఏమైనా జీవితం ప్రశాంతంగా గడిచే సూచనలుమట్టుకు లేవు.

యుద్ధమేఘాలు కమ్ముకుంటున్నాయి. ఎక్కడచూసినా అక్కడ తీవ్రమైన వాదప్రతివాదాలు జరుగుతున్నాయి. కలగజేసుకుందామనే వాళ్ళు కొందరు, ముక్కుమూసుకు కూచుందామనే వాళ్ళు మరికొందరూ. (Interventionists and Isolationists). వాషింగ్టన్ అంతా ఈ ప్రకారం రెండుగా చీలిపోయింది.

1941 వసంతకాలంలో ఒకరాత్రివేళ, బాగా అలిసిపోయి యింటికిచేరుకున్నాడు బాబ్. ఆ పూట భోజనమయ్యాక, ''నౌకాదళంలో చేరుతున్నాను,'' అన్నాడు.

''ఎందుకు?'' అని బేలగా ప్రశ్నించాను.

"తొందరలోనే మనం ఈ యుద్ధంలో ప్రవేశిస్తాం. ఆలస్యంగా ఎందుకని ముందరే చేరుతున్నా."

మొదటి రెండు వైద్యపరీక్షలలోను అతను సెలక్ట్ కాకపోవడం చూసి, అప్పటికైనా ఆ అభిప్రాయం మార్చుకుంటాడనుకున్నాను. వెర్రిదాన్ని! పెళ్లయి రెండేళ్ళు అయిందిగాని అతని మనస్తత్వం గ్రహించలేకపోయాను.

తనకివున్న పలుకుబడి అంతా ఉపయోగించడం శాబ్ కి అదే మొదటిసారి. తెలిసినవాళ్ళందరినీ చూసేవాడు. "మెడికల్ గా పనికిరానప్పుడు నీకెందుకీ శ్రమ – అదృష్టవంతుణ్ణి అనుకుంటూ నిక్షేపంగా కూచోక!" అనేవారు వాళ్ళు.

నౌకా దళానికి చెందిన రహస్య సమాచార శాఖ వారు మధ్యధరా రంగానికిగాను, ఆఫ్రికన్ భాషలు వచ్చిన తెలాంటి మనిషికోసం వెతుకుతున్నారని తెలుసుకు, తిన్నగా వెళ్ళి, ఆ శాఖాధికారిని చూశాడు.

ఆ వేళ యింటికి రావడమే ఈలపాట పాడుతూ వచ్చాడు. ఇంకా, మూడవ మెడికల్ టెస్ట్ వుందిగదా, యిది ప్యాసవనీ – అనుకుంటున్నాను. అదేం తమాషో, ఆ టెస్ట్ యిట్టే పాసయాడు. జూనియర్ గ్రేడు లెఫ్టినెంటుగా అతనిని పెనమాకి పంపించారు – ఆఫ్రికాకి కాదు.

వాషింగ్టన్‌నుంచి నేను వర్జీనియాకి మారాను. పై జనవరినాటికినాకు పురుడొచ్చేరోజులు. బాబ్ వుండేది పెనమాయే కనక, పురుడు వెళ్ళేక, అతనున్న చోటుకి వెళ్ళవచ్చుననుకున్నాను. పెరల్ హార్బర్ ప్రమాదంతో ఈ ప్లాను తలకిందులయింది. 1942 జనవరి 11న మా అబ్బాయి స్టీవ్ పుట్టాడు. మేము పెనమా వైపుకి వెళ్ళడం యింక సాధ్యం కాలేదు. జూన్‌లో సెలవుమీద యింటికొచ్చాడు బాబ్. "అందరి పిల్లలకీ మల్లేనే వున్నాడు వీడూను," అంటూ, కుర్రవాణ్ణి శిరసుమీద స్పృశించాడు బాబ్. "క్లిషేగో మరోలా ఉంటాడనుకున్నాను." అన్నాడు.

బాబ్ పెనమాలోవున్న పదినెలలూ పదేళ్లలా ఉన్నాయి. యుద్ధం ఒక దారిలోపడింది. అందరినీ ఏదో ఉత్సాహం చుట్టేసింది.

ఒకేతప్పు రెండుసార్లు చేయడం నాకిష్టం లేదు. నాకా ఏళింవారు వుండనిచ్చినంతకాలం బాబ్ వెంట వుందామనుకున్నాను. రహస్య సమాచార శాఖనుంచి 'యాక్టివ్ సర్వీసు' లోకి తను నెమ్మదిగా మారబడ్డానని. దక్షిణానవున్న 'మొయిమి' లో కొన్నాళ్లపాటు ట్రయినింగ్ పొందవలసివుందని బాబ్ అనేటప్పటికి, నేనూ పిల్లాడూకూడా తన వెంట వస్తామని అన్నాను.

స్త్రీలు యింటిదగ్గిర వుండటం మంచిదిగాని, యుద్ధ కాలంలో భర్తలని అలా వెంటాడటం క్షేమదాయకం కాదని కొందరన్నారు. కాని, నావుట్టుకునేను, యిలాంటి సమయం లోనే, ఎంతవరకూ వీలుగావుంటే అంతవరకూ, భర్తని అంటిపెట్టుకు వుండటం, కుటుంబబంధాన్ని దృఢతరం చేస్తుం దని నమ్మాను.

కాని, ఒకరోజు రాత్రి, బాబ్ యుద్ధనౌకాధి పతి వెంట వెళ్లాలని ఉత్తరువువచ్చింది. మెయిమినుంచి విమానంలో అతను వెళ్లిపోయాడు. పిల్లాడూ నేనూ ఆత్మీయ మైన మా పాతకారులో నర్జీనియాకి ప్రయాణమై వచ్చాం.

యుద్ధపు రోజుల్లో కాలం కదులుతున్నట్టేఉండదు. రోజు లెంతకీ గడిచేవికావు. వ్యక్తిజీవనానికి అర్థంపోయింది. ఎన్ని ఓడలు మునిగాయి, ఎన్ని ప్రాణాలుపోయాయి. ఎన్నిరంగా లలో యుద్ధం జరుగుతోంది - అదే లెఖ్ఖ. గవుడాల్ కెనాల్ నుంచి బాబ్ రాశాడు: యుద్ధం పూర్తి అయాక, ఒక చిన్నపత్రిక కొనుక్కు దానినడపాలని వుందని. ఆవిష యమైనా అభిప్రాయమేమిటన్నాడు. మరీలోతుకి పోకుండానే, మనం కొన్ని పనులు చేస్తాం. జీవితంలోని ప్రముఖ సంఘటన లన్నీ అంతేనేమో! ఆషామాషీగా అనుకున్నవే నిజమవు తాయి. "ఓ-చాలా అద్భుతంగా ఉంది ఉద్దేశం. సి ఉద్దే

శమే నా ఉద్దేశం. తప్పకుండా కొందాం ఒకపత్రిక'' అని, వెంటనే రాసేశాను బాబ్ కి. మేము పత్రిక వేయడం, దానికి మాకు పులిట్జర్ ప్రయిజు రావడం, మేము ఎంతో గొప్ప వాళ్లమని పదిమందీ పొగడటం - ఇలా ఏమేమో చిత్రించు కొనేదాన్ని ఊహాసౌధంలో; కాని, మా యిద్దరికీ పత్రికల సంగతి బొత్తిగా తెలియదనే ఆలోచన రాలేదు నాకు.

బాబ్ అయిదేళ్లపాటు నౌకాదళంలో కమాండర్ గా పనిచేశాడు. యుద్ధమైపోవడంతో, అతను విడుదల పొంది నాడు. ప్రభుత్వమింక మమ్మల్ని శాసించదు. మా యిష్ట మొచ్చిన చోటుకి మేము పోవచ్చు; మాకు నచ్చినపని చేసుకోవచ్చు. పై చూపులకి మా ప్రపంచం మారలేదు; కాని వ్యక్తిగత ప్రపంచాలు మారాయి; ఆసంగతి మా యిద్దరికీ తెలుసు. యుద్ధకాలం మామధ్య తీసుకొచ్చిన దూరాన్ని పోగొట్టుకు, రెండు జీవితాలకి తిరిగీ సమన్వయం ఏర్పరుచు కుని యిల్లు నెలబెట్టుకోవాలి. ఎడంఎడంగావున్న సంవత్స రాలలో మేము నేర్చుకున్నదేమిటంటే, యిద్దరం కలిసి ఆడుతూ పాడుతూ జీవనభాగస్వాములుగా జీవించడమే దాంపత్య ధర్మమని తెలుసుకున్నాం. యుద్ధమయాక చిన్న పత్రిక కొనుక్కుందామని బాబ్ రాయగానే, ఆ పత్రికని మేము యిద్దరం కలిసి నడపడమే జవాబుగా తోచిందినాకు.

''మీ రేమిటి? మామూలు పత్రికను కొనడ మేమిటి? దాన్ని మీరు ఎలా నడపగలరు? గ్రామాల్లో ఉండటమంటే ఏమిటో మీకు తెలుసా?'' - అని వాషి-గ్టన్‌లోని మా మిత్రులు మమ్మల్ని నిలవదీసి అడిగారు.

యుద్ధకాలంలో దాచుకున్న దానిని బాంక్ సెలవల కొచ్చినప్పుడు, విచ్చలవిడిగా ఖర్చుపెట్టేవాళ్లం. 1945 నవంబరునాటికి మా దగ్గర వెయ్యిడాలర్లుకూడా లేవు. మేము ఏదో ఒక నిశ్చయానికి రావాలి; ఇన్నాళ్ల జీవితం వేరు. యిక ముందు వేరు. ఏదో ఒకటి చెయ్యాలి; పుట్టినే [illegible] ఎలా గడుస్తుంది?

అది రాత్రి వేళ. స్నేహితులింట్లో సెలవు తీసుకొని, యిద్దరం వీధిలోకి వచ్చాం. బయట చలిగా ఉంది. ఒకళ్ళ చేతులొకళ్ళు పుచ్చుకు నడుస్తున్నాం. వాషింగ్టన్ మహా నగరం. అమెరికా దేశపు రాజధాని. యుద్ధానంతరం ఈ అమెరికన్ ప్రజానీకపు హృదయావేదన ఆ రాత్రి వేళ, ఆ వీధులమ్మట నడిచి వెళ్తున్నప్పుడు మాకు అర్థమయింది. ఒక్క వాషింగ్టన్‌లోనే కాదు - ప్రపంచ నగరాలన్నిటిలోనూ, వేలు లక్షలుగా మాలాంటి స్త్రీ పురుషులు, - ముందు గతి ఏమిటి. ఏ రకంగా జీవిద్దాం? - అని తపనపడుతున్నారు. ఈ యుద్ధానంతర ప్రపంచంలో ఎందరో వారివారి జీవితా

అని దిద్దుకుంటున్నారు; ఒక వరవడిలోకి తెచ్చుకుంటున్నారు. ఆ లక్షలూ కోట్లలో మేము ఎన్నోవంతు?

అని నిస్పృహ చెందుతామా? ఎవరిజీవితాలు వారికి ముఖ్యం. ఇంత పెద్ద దేశంలో చిటికిన వేలు చివరిభాగం నుట్టుకు ముఖ్యం కాదూ - అలాగే! ప్రపంచంతో సంబంధం లేకుండా ముక్కుమూసుకు కూచోడం (Isolation) అనే దానికి అర్థంలేదని తెలుసుకున్నాం. మన మందరం ఒకర్కొకరం సహాయభూతులంగా వుండవలసిన వాళ్ళం. ఒక చిన్నవార్తా పత్రిక ద్వారా మేమిద్దరం యితరులతో కలిసిమెలిసి తిరుగుతూ తద్వారా ఉత్తమపౌరత్వం తెలిసికొని, దానిని చేస్తూ గలుగుతామేమో! మానవులు ఉత్తమ పౌరులైనప్పుడే గదా ఈ యుద్ధాలూ సమసిపోవడం.

ఆ రాత్రి నడిచి వస్తూండగా బాబ్ ని అడిగాను : "పత్రికవల్ల సంతుష్టి కలుగుతుందని నీకు మనస్ఫూర్తిగా నమ్మకం వుందా? నీకు కావలసింది పత్రికేనని స్పష్టంగా అనిపిస్తోందా?"

"అనిపిస్తోంది. ఎందుకనిపిస్తోందని అడగకు-మాటల్లో చెప్పలేను. మనిద్దరం అలాంటిదానికోసమేనని అనిపిస్తోంది."

# 3

మనసు నిశ్చయం చేసుకున్నాం. అందుబాటులో ఏదయినా పత్రిక కనిపించాలి మాకు కొనేందుకు. నేనూ స్టీవూ డవునింగ్ టవున్ లోని వాళ్లమ్మగారింట్లో (అత్త గారిల్లో) వుంటూండగా, అతను పత్రికాన్వేషణకై బయలు దేరాడు.

జేబులో డబ్బు వేసుకొని బజారుకెళ్ళి ఒక కొత్త కారు కొన్నంత సులువుగా, పత్రికని కొనలేంగా! మేము ఎవరిని అడిగినా, పరస్పరవిరుద్ధమైన సలహాలు చెబుతూండే వారు.

పెన్సిల్వేనియాలో పత్రిక దొరికితే బావుండునని బాబ్ అనుకుంటున్నాడు. అది అతనికి బాగా తెలిసిన చోటు. దేశం మొత్తంమీద, యిటూ, అటూ, మహా తిరిగాడు కొన్నివారాలపాటు. చివరికి డవునింగ్ టవున్ కి వొట్టి చేతులతో, నిరాశోపహతుడై తిరిగి వచ్చాడు.

వాళ్లమ్మగారి యిల్లు చాలా విశాలమైనదే – కాని, ఇంటి నిండా బోలెడుమంది మనుషులు. వితంతువు మేనత్త, పెళ్ళాం బిడ్డలులేని పెదతండ్రి, యుద్ధకాలంలో యిల్లూ వాకిలీ పోగొట్టుకున్న ముగ్గురు దగ్గిర-చుట్టాలూ, వాళ్లపిల్లలూ మొత్తంమీద ఎప్పుడూ ఏదో హడావిడిగానే ఉండేది.

ఇంట్లో ఏమూలచూసినా పెట్టెలూ, బట్టలూ. ఉన్నవాళ్లు చాలక మేము కూడా వచ్చిపడ్డా ఇక్కడ. అయిదేళ్ళ యుద్ధకాలంలో, ఒక్కనాడు కూడా వొంట్లో నలతగా వుండటమంటే ఏమిటో తెలియని బాబ్‌కి, యిక్కడికిరాగానే కామెర్లు పట్టుకున్నాయి. భవిష్యత్తు చూదామా అంటే, అంధకారబంధురంగా ఉంది.

మేము అనుకున్న ప్లాను కార్యరూపానికొస్తుందా రాదా అను సంశయం పట్టుకుంది. ఏ వంక చూదామన్నా నిస్పృహే! కాని, కొందరు పత్రికలు "ఆక్కాయిన్" పత్రిక కొనకూడదా అన్నారు మాటవరసకి. పత్రిక యజమాని దానిని అమ్మడానికి సుతరామూ అంగీకరించలేదు. బాబ్‌కి కాస్త నెమ్మదించాక, మళ్ళీ తన మామూలు అన్వేషణలో పడ్డాడు.

మానసికంగానూ శారీరకంగానూ చీకాకులకి లోనవుతున్నాం. ఇలా వుండగా, ఒకరోజు సాయంత్రంవేళ టెలిఫోన్ గణగణ మోగింది. సమాధానం చెప్పేందుకు బాబ్ మేడదిగి కిందికి వెళ్ళాడు. అతను పైకివచ్చి, విషయమేమిటో చెప్పేలోపున కొన్నిశతాబ్దులు గడిచినట్టయింది.

పైకివచ్చి, సోఫాలోకి వాలుతూ, నుదుటిమీద చన్నీళ్లగుడ్డ కప్పుకు, "పూర్తిచేశాను," అన్నాడు.

ఇంట్లో వున్న వాళ్లందరూ - ఏమిటేమిటని - అడిగారు.

"ఆర్క్యుయిన్ పత్రిక కొన్నాను." అన్నాడు.

బాబ్ కి 102 డిగ్రీల జ్వరముంది ఆరోజున. పత్రికా ప్రచురణకి సంబంధించిన సరాకులన్నీ కిరిగిపోతున్నాయని బాధగాని, లేకపోతే కొనివుంచుకూ ఆ పత్రికని అయిదువేల డాలర్లకి? ఏదో ఒక పశ్నె మానికి రాకతప్పదు. మన సమస్యలని మనం పరిష్కరించుకోవాలి గాని కాలం పరిష్కరించదు. నిశ్చయమానేది జరిగాక రోగమంచు విడిపోవడం మొదలెట్టింది. ఒకటా, రెండా - అయిదువేల డాలర్లు. ఎవరిదగ్గరనైనా అప్పుచెయ్యాలి, అప్పుచేస్తేనేం గాక - పత్రికా సంపాదకులమని అనిపించుకున్నాం.

# 4

1946 మే 1 వ తేదీన "ది ఆర్క్యుయిన్" కొన్నాం. మేము పబ్లిషర్స్మి - కాని చేతిలో దమ్మిడీలేదు. మా పత్రికని అచ్చువేసేందుకు ప్రెస్ లేదు. అయిదువేల డాలర్లూ పెట్టి మేముకొన్నది నామకార్థమైన పత్రిక; నాలిగూళ్ళతో నిండి వున్న చిన్నగది - అదే ఆఫీసు; రెండు చెడిపోయిన టైపు





రైటర్లూ, ఒకతాళం తా[illegible]ట్టే; వీటితో పాటు బ్రహ్మాండమైన ఆశలూ. అదీ మా సంపద.

మమ్మల్ని బోల్తాకొట్టించారనే సంగతి మా కానాడు తెలియలేదు. అంతేగాక, డవునింగ్ టవున్ పత్రికలని పూడ్చిపెట్టే ప్రదేశమనీ, అప్పటికప్పుడే ఆరుపత్రికలకి అక్కడ గోరీ కట్టేశారనీ కూడా మాకు తెలియదు. వ్యాపారరీత్యా వున్న సాధకబాధకాలు అంతకంటే తెలియవు. ఫిలడెల్ఫియా నుంచి రెండు పెద్దపత్రికలు డవునింగ్ టవున్ వార్తలతో ప్రతిరోజూ వస్తాయి.

కొన్నివారాలయ్యే టప్పటికి ''అక్వయిర్'' గురించి కొన్నినిజాలు మేము తెలుసుకున్నాం. మా పత్రికకి పేపరు కొట్ల (న్యూస్ స్టాండ్స్) ద్వారా వుండే అమ్మకం వారానికి 5 కాపీలు; మాకు చెప్పజెప్పిన 1750 మంది చందాదారుల పట్టీలోను 60 మంది తప్ప మిగతావారు చనిపోయారు; 1946 మే లో మేము ఆ పత్రికకి – 71 సంవత్సరముల వయసుగల ఆ పత్రికకి – యజమానులు, ఎడిటర్లు, పబ్లిషర్లు యడ్వర్టయిజ్‌మెంటు మేనేజర్లు, రిపోర్టర్లు – ఆఫీసు కుర్రాళ్లు – ఒకటేమిటి, సర్వం మేమే అయాం. మా మొహానికి ఎలా బొప్పి కడుతుందో చూదామని ఊళ్లోవాళ్లందరూ కాసుకు కూచున్నారు.

మా డవునింగ్ టవున్ లోని 5000 మంది ప్రజా, మిగత అన్ని గ్రామాల్లో మనుషుల్లాంటివాళ్ళే! ఎలావున్నది అలా వుండనీయమంటారు; మార్పు అంటే వాళ్ళకి మహాచెడ్డ చిరాకు. నా మానాన మమ్మల్ని వుండనీయండి - అనేది వాళ్ల ధోరణి అని, గ్రామాధికారి (మేయరు) ఒకసారి అన్నాడు. తలుపులు వేసేసుకు, నాలుగుగోడలమధ్య వాళ్ల బాధలు వాళ్ళు అనుభవిస్తారుగాని, వీధిని పడటం యిష్టం ఉండదు. తలుపులు మూసేసుకుంటారు. రండి, ముందుకినడుద్దాం అంటే, - రారు.

కాని, మేము తలుపులు తెరిపించడం మొదలెట్టాక, మంచీ చెడూ, ఆశా నిరాశా, కష్టం సుఖం - యివి మానవులందరికీ అన్నిచోట్లా ఒకటేనని తెలుసుకున్నాం. పైకి జడులుగా కనిపించేవారి అంతర్యంలో సానుభూతి వుండవచ్చు. పురపాలకసంఘానికి డబ్బువుండదు; నడివీధిలోని చిన్న గొంయ్యి కొత్తకారు స్ప్రింగ్ లను విరగ్గొడుతుంది. నలుగురు పిల్లల తల్లికి యిల్లూవాకిలీ లేకపోయేటప్పటికి ఊళ్లోవాళ్ళు తిండీబట్ట యిచ్చి, జీవనోపాధి చూపిస్తారు. చిక్కుల్లోవున్న కుటుంబాలకి క్రిస్మస్ టైములో, చేతికి ఎముక లేనట్లుగా సహాయం చేస్తారు వర్తకులు.

ఇవే కాదు మేము తెలుసుకున్నది - ఇంకా చాలా

వున్నాయి. సంకుచితమైన ద్వేషాలూ దురభిప్రాయాలూ పోగొట్టాలి. పైకి కనుపించేదే నిజమనుకోకూడదు. మనిషి ముఖం ఒక్కొక్కప్పుడు అతని ప్రవర్తనని కప్పిపుచ్చుతుంది కూడాను. అబద్ధాన్ని నిజమని నమ్మించబోతారు కొందరు. మానవస్వభావం గురించి మాకు ఓనమాలుకూడా తెలియవని, - పత్రిక మొదలెట్టాక తెలుసుకున్నాం.

పత్రికని పోస్టులో తెచ్చేసేవాడు కాబట్టి, వెనకటి యజమానికి, ప్రతివారం నాలుగు డబ్బులు గిట్టేవి. యడ్వర్టి యిజ్ మెంట్లమీద వచ్చిన డబ్బు కొన్నాగా అతని జేబుల్లోకి వెళ్ళేది. పనో మనిషిపూసి మాం రేడుకాయచేస్తూ, ప్రతివారం పత్రికని బయటపడేస్తూండేవాడు. ఈ పత్రికకిగాను అతను ఒక ప్రెస్సుని, అద్దెకి తీసుకున్నాడు. అచ్చుపనులు సంపాయించి పెట్టేందుకు, ఈ పత్రిక ఉపయోగబడుతూండేది. రెండుచేతులా సంపాయించి, ఒక మంచిరోజున చేతులు కడుక్కున్నాడు ఆ పాతయజమాని. ఇక మా నెత్తికొచ్చి చుట్టుకుంది. మా పని ఎలా ఉందంటే, సక్కులేషన్ పెరిగిన కొద్దీ ప్రొడక్షన్ ధరకూడా మరీ ఎక్కువవడం మొదలెట్టింది. లాభానికి బదులు నష్టం కనిపించేది,

అందుకనే చిన్నపత్రికలవారు అచ్చుపనులమీద ఆధారపడతారు. అచ్చుపనులు వారిని నిలబెడతాయి,

పత్రిక సైక్లోస్టైలు రనుగా ఉంటుంది. ఇలాంటి పత్రికలు నిజానికి పత్రికల్లా ఉండవు - పోట్లాలు కట్టుకునే కాయితాల్లా ఉంటాయి. పబ్లిషరుకి లాభంగాని ప్రజలకేమీ ప్రయోజనం లేదు. అటువంటి పత్రికకి నోరువాయీ ఉంటుంది గనకనా ప్రజాభిప్రాయం చెప్పేందుకు? అసలు అటువంటి పత్రిక అందరికీ నవ్వులాటలుగా ఉంటుంది. రేపు ప్రచురణ తేదీ అనగా యివ్వాళ ఆలోచిస్తాడు ఆ పత్రిక ఎడిటర్, దానిగురించి. కట్టల్లోని నాలుగు కాయితాలు తీసి, గబగబ కంపోజ్ చేయించి, మొక్కుబడిలా ఆ నాలుగు పేజీలూ నుద్దించేస్తాడు. చివరికి. ఆ పత్రిక చేతులు తుడుచుకునేందుకు ఉపయోగబడుతుంది.

నాకు అంతవరకూ అచ్చాఫీసు అంటేనూ, ప్రింటింగ్ అంటేనూ ఏమీ తెలియదు. పత్రికలనేవి పోస్టులో వస్తాయనేగాని. యింత గొడవ వీటికివున్నదని అనుకోలేక పోయాను. జీవితంలో కొత్తదనం, కొత్తపనీ అగుపడ్డాయి. నేనూ బాబ్ కలిసి వారానికి ఒకవంద చందాదారుల స్థాపన చెయ్యగలం. టైప్‌రైటర్లు ముందేసుకు కూచుని, ఈ డప్లికేటింగ్ టవున్ని కొత్తదానిగా మార్చేయగలం. పైన ఎగిరే విమానం నేలమీదకి దిగింది. మేమూ మనుషుల్లో పడ్డాం. "ఆర్కైవ్" ప్రింట్ చేయించేందుకు ఏదైనా ప్రెస్ వెతకాలి.

న్యాయవాదులూ, రాజకీయవాదులూ ఎన్నితరహాలుగా ఉంటారో, చిన్న పత్రికలవారు కూడా అంతే. వారొక ప్రత్యేకజాతి. వారి విజయం, వారు సాధించిన కార్యాలలోనూ, వారుచేసిన అప్పులలోనూ కనపడుతుంది- అంతే గాని వారి ఆస్తుల్లోనూ నిలవల్లోనూ కాదు.

చిన్న పత్రిక ఎడిటర్‌కి (Country Editor) తన తోడివారి సమస్యలపట్ల నిజమైన సానుభూతి వుండాలి. దయాంతఃకరణంతో అందరిపట్లా అనురాగం చూపించగలగాలి. ద్వేషపూరితం కాని ఆసక్తితో అన్నివిషయాలూ ఆకళింపు చేసుకోవాలి. పెద్ద పత్రిక ఎడిటర్‌కి ఈయిబ్బందులేమీ లేవు. సంపాదకవర్గం అతనిని కాపాడుతూంటుంది. చిన్నపత్రిక ఎడిటర్ తన చందాదారులకి సంజాయిషీ చెప్పుకోవలసినవాడు. గ్రామవైద్యుడూ, గ్రామ ఉద్యోగులూ లాగానే యితను వారికి నిత్యం కనిపిస్తూంటాడు. ఇతనికి పరాయివాళ్లంటూ లేరు; అందరూ తనవాళ్లే! కొందరితో పరిచయం ఉంటుంది; మరికొందరిని పరిచయం చేసుకోవాలి - అంతే!

కంపోజిటర్ ఒకవంక మేటరు కావాలని తొందర పెడుతూంటే, దారిని పోతూ చూడవచ్చిన మిసెస్

జోన్సుతో నవ్వుతూ మాటలాడగలగాలి కంట్రీ ఎడిటర్. (కంట్రీ ఎడిటర్ అంటే చిన్నపట్నంలోని చిన్నపత్రిక ఎడిటర్). అలా విజిటర్లు వస్తూంటారు, పోతూంటారు; తన టేబులూ గదీ తనే శుభ్రంచేసుకు, ప్రూఫులు దిద్దుకుంటూ, వ్యాసాలు చదువుకుంటూ, యడ్వర్టయిజ్ మెంటులు రాసుకుంటూ, పత్రిక పేజీలు ఆదరాబాదరా కట్టేస్తూ, ప్రవారానికావారం ఒక యజ్ఞం పూర్తిచేయవలసి ఉంటుంది – కంట్రీ ఎడిటర్ అన్నవాడు. ఊళ్ళో ఏ మీటింగయినా పిలుస్తారు; ఏసభ జరిగినా రమ్మంటారు; ప్రతి కమిటీలోను అతని పేరుకూడా చేరుస్తూంటారు. చివరికి, రాయడంకంటె మాటలాడటం ఎక్కువవుతుంది. ఏ ఒక్కరూ తన గురించి మంచిగా చెప్పరుగాని, ప్రతివాళ్లగురించీ తను మంచిముక్క అనాలి; కాలమ్ మేటరుని ఒక్క ముక్కలో చెప్పాలి; ఇందంతా ఎందుకు, తనే ఒక డిక్షనరీ అయుండాలి.

సామాన్య ప్రజలమీద అతనికి గౌరవం ఉండాలి. పదిమంది మంచికీ అతను చిహ్నం; ప్రజాస్వామ్యానికి పట్టుకొమ్మ. తన టేబుల్ కి తను మహాప్రభువు; తన పత్రికకి తను చక్రవర్తి.

అటువంటి పత్రికా సంపాదకుడే మార్టిన్ లియూండిన్. డవునింగ్ టవున్ కి 13 మైళ్ల దూరంలో వున్న హాసీబ్రూక్

లోని "నార్థరన్ ఛెస్టర్ కవుంటీ హెరాల్డ్" అను పత్రికకి అతను ఎడిటర్, పబ్లిషర్, ప్రొప్రయిటర్–మూడూను. పత్రికా ప్రచురణకి దిగడానికి పూర్వం అతను ఫిలడెల్ఫియాలో శాంకరు. అనవసరంగా, డబ్బుసంపాదనతో కాలం వృథాచేసుకోనక్కర్లేదనుకుని, శాంకరు పనిమానేసి, భార్యా ముగ్గురుపిల్లలతో హానిబ్రూక్ వొచ్చి, ఈ హెరాల్డ్ పత్రిక కొన్నాడు. ఒకమారు వాళ్ల ఆఫీసుమీద నిజంగా పిడుగు పడింది. పిడుగుపడ్డప్పటికీకూడా వాళ్లపత్రిక ఆగలేదు. ప్రతీవారం సక్రమంగా వెలువడుతూనే వుంది; అతని ఉత్సాహం వీసమంతకూడా తగ్గలేదు.

1946 వసంతకాలంలో నేనూ, బాబ్ హానిబ్రూక్ వెళ్ళాం: మాకు చాలా ఆందోళనగా ఉంది. నిలవవున్న డబ్బంతా అయిపోయింది; ఆ లైనులో మాకు అనుభవమూ అంటే, శూన్యం. ఇద్దరికీ భయంభయంగాఉంది. ఆ భయమే మాయిద్దరినీ మరింత గట్టిగా కట్టేసింది. మనసులో వున్న ఆందోళనపైకి చెప్పుకోడానిక్కూడా భయమే! హెరాల్డ్ పత్రిక ఆఫీసులోకి వెళ్ళాం: ఎర్రయిటుకలతో కట్టినవలుచదరపు యిల్లు అది. మా ప్రింటింగ్ బాధలు వీళ్ళు ఏమయినా తీర్చగలరేమో అనిపించింది–లోపల పాదం పెట్టీపెట్టగానే!

మార్టిన్ లియాండీస్ బాంకరులా ఉన్నాడుగాని చిన్న

పత్రిక ఎడిటర్‌లా లేడు. చక్కటిసూటూ, కలకళ్లాడే మొహం, నీలంకళ్లకి తళతళా మెరిసే బంగారపు కళ్లజోడూ - మనిషి బావున్నాడు. మమ్మల్ని ఎంతో ఆప్యాయతతో ఆహ్వానించాడు. "ఆర్క్‌యిన్" కొన్న మెక్లవిన్ దంపతులు మీరే నన్నమాట. మిమ్మల్ని కలుసుకోడం చాలా సంతోషం," అన్నాడు.

మధ్య మధ్య టెలిఫోన్ కాల్స్‌కి జవాబు చెపుతూ, పనివారికి సూచన లందిస్తూ, మాతో చాలాసేపు సంభాషించాడతను.

"మీరు ఆర్క్‌యిన్ కొనడం చాలా మంచిపని, ప్రింటింగ్ది ఏముంది - నేను ప్రింటు చేసిపెడతాను," అన్నాడు.

ఆ పూట మమ్మల్ని భోజనానికి వుండిపొమ్మన్నాడు. ప్రింటింగ్ది ఏముంది. నేను చూస్తానుగా - అంటూ మాకు ధైర్యం చెప్పాడు. వారపత్రిక ప్రింట్ చేయడం అంత సులువా ? - కాదు. కాని, మార్టిన్ లియాండీస్‌లోని విశ్వాసబలం మట్టుకు చెప్పుకోదగ్గది.

# 6

మొదటి మెట్టు దాటాం. మా పత్రిక ప్రింటు చేయించుకునేందుకు స్థలమంటూ ఒకటి దొరికింది. ఇంకో రెండువారాలలో, పునరుజ్జీవింపబడిన ఆర్కాయివ్‌ని, బయటికి తీసుకొద్దామనుకుంటున్నాం.

మొట్టమొదట యడ్వర్టయిజ్‌మెంటులు చూసుకోవాలి. మళ్లీ క్రొత్తగా ప్రారంభిస్తున్నాం గనక, మొదటి రెండు సంచికలూ చాలామందికి ఉచితంగా పంచుకుదామనుకున్నాం. 3200 మందికి పంచుదామన్నాడు బాబ్; వర్తకులందరికీ మనగురించి తెలియాలన్నాడు.

ప్రకటనదారు (యడ్వర్టయిజర్) ఎప్పుడూ పత్రిక్కి ఎంత ప్రచారంవుందో (సర్క్యులేషన్) అడుగుతాడు. సర్క్యులేషన్ పెరిగేందుకు మంచి మంచి బొమ్మలు, చక్కని వార్తలు, ఘాటైన విషయాలు సేకరించాలి. మంచివార్తలు సేకరించడమెలా అనేది, మా ప్రధాన సమస్య అయింది.

మేమిచ్చేవార్తలు ప్రత్యేకత కలిగినవై ఉండాలి. పెద్దపత్రికలు ''చెడ్డపనుల''కి సంబంధించిన వ్యాసం మొదటి పేజీలో వేస్తాయి. గ్రామీణ పత్రిక అలాచేయడానికి వీల్లేదు. ''మంచిపనుల''నే మొదటి పేజీలో వేయాలి.

సభలూ, సమావేశాలూ, యిరుగు పొరుగులో వుండే సుగుణ సంపత్తీ-యివి ప్రాధాన్యత వహించాలి. ప్రక్కనున్న అయిదారు గ్రామలనుంచి వార్తలు సేకరిస్తూండాలి; అప్పుడుగాని చుట్టుపక్కల గ్రామాలవారికి మా పత్రికమీద అభిమానం కలగదు.

డవునింగ్‌టవున్ వార్తలు తనకి తాను చూసుకుంటానన్నాడు బాబ్. వార్తాసేకరణ అంటే, ఎందర్ని తెలుసుకోవడానికి వీలో, అందర్ని తెలుసుకోవాలన్నమాట. చర్చి ఉద్యోగుల్ని చర్చి వార్తలు పంపమన్నాం; మూడు కార్మిక సంఘాలువున్నాయి – ఆయా సంఘనాయకుల్ని వారివారి వార్తలు పంపమన్నాం; – కార్మికనాయకులు మేమేదో వేళాకోళం చేస్తున్నామనుకున్నారు: ఎందుకంటే, వార్తలు పంపమని వారిని ఈమాదిరిగా ఎవరూ అడగలేదింతవరకూ, మేము ఆయాసంఘాల వార్తలు ప్రచురించడం మొదలెట్టే సరికి, వారెంతో ఆనందించి, మాతో సహకరించనారంభించారు.

వర్తక సంఘం, క్లబ్, యువజన సమితి, స్కూలు కమిటీ, పురపాలకవర్గం – యిటువంటి వివిధ సంఘాల వార్తలు మా పత్రిక చదివే పాఠకులకి కావలసివుంటాయి. ఇంకా మొదటి సంచిక వెలువడకపూర్వం నుంచే, మీటింగులకి హాజరవడం మొదలెట్టాం.

రెండుకాలములు సంపాదకీయం విధిగా ఉండాలని బాబ్ అభిప్రాయం.

మరొక పత్రికా సంపాదకు డన్నాడు. "సంపాద కీయా లెందుకు? వారపత్రికలోని సంపాదకీయా లెవరూ చదవరు. వాళ్ళకి కావలసిందల్లా పేర్లు - వాళ్ళ పేర్లు, వాళ్ళ వాళ్ళ పేర్లు."

"పేర్లూ వుంటాయి: కాని ప్రతివారం రెండేసి కాలముల సంపాదకీయం వ్రాయదల్చుకున్నాను," అన్నాడు బాబ్.

1946 మే 16 వ తేదీపత్రికలో అతనుమొట్టమొదటి సారిగావ్రాసి, కొట్టేసి, మళ్ళీ వ్రాసిన సంపాదకీయం ఇది.

స్వవిషయం. (Strictly Personal)

"ఎన్ని అవాంతరాలు వచ్చినా, ఫలానా పని చెయ్యక తప్పదని నీకు అనిపిస్తే, ఆపనేదో చేసెయ్. విజయం (Success) నిన్ను ఆమార్గంలోనే వరించవచ్చు."

కాలేజి చదువు అయిపోయి, బయటికొచ్చాక, ఒక పెద్ద మనిషి నాకు చెప్పిన సలహా అది. నేనప్పుడు శిల్పకళ అభ్యసిద్దామను కుంటు న్నాను. మూడేళ్లపాటు చదవాలి. ఆ మూడేళ్లూ నన్ను నేను పోషించుకోవాలి. "ఎన్ని అవాంతరాలు వచ్చినా శిల్పిని అవడం నా గమ్యమా?" - అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను. కాదని తోచింది.

అప్పటికీ యిప్పటికీ మధ్య చాలా సంవత్సరాలు గడిచాయి. ఎన్నో అనుభవాలు, ఎంతో జీవితం - కాలం వృధాగా దొర్లిపోయిందని చింత పడనవసరం లేదు. యుద్ధకాలంలో సముద్రం మీద ఉన్నప్పుడు ఎన్నో రాత్రుళ్లు ఒకే కోరిక నన్ను వేధించేది. ఎన్ని అవాంతరాలు వచ్చినా, ఆ ఆశయం కార్యరూపం దాల్చాలని అనిపించేది; చిన్న పత్రిక ఒకటి నిర్వహించాలనే తీవ్రతరమైన కోరిక అది.

మాదింకా ప్రారంభదశే, ఎన్నో అవాంతరాలు రానున్నాయి. భవిష్యత్తు పట్ల నమ్మకముంచడమే మానవులమైన మనం చేయగలపని. మీలో కొందరు నాకు చేయూత నివ్వడానికి అంగీకరించారు. మీరు నామీద ఆగాధంగా వుంచిన విశ్వాసాన్ని నిలబెట్టుకునేందుకు సర్వదా కృషి చేస్తాను.

ఇటువంటి చిన్న వార పత్రిక తన పాఠకులకి స్థానిక వార్తలనీ, స్థానిక విశేషాలనీ అందజేయాలి. నిష్పాక్షిక దృష్టితో వార్తా సమాకు అందజేస్తోందని మీ అందరిచేత అనుపించుకోవడమే నా ఆశయం.

సంపాదకీయంలో పత్రిక అభిప్రాయం ఉంటుంది. చందాదారులకీ ప్రకటనదారులకీ భయపడే పత్రిక, ఏ అభిప్రాయాన్ని నిర్మొగమాటంగా చెప్పలేక పోతుంది. డవునింగ్ టవున్ లోని ప్రజలందరి క్షేమంకోసం ఈ పత్రిక పాటుపడుతుంది. అది చిన్న విషయం మనుకునేరు! - కాదు, చాలా పెద్ద విషయం. సంపాదకీయం వున్న పేజీలోనే సంపాదక లేఖలు (Letters to the Editor) కూడా ఉంటాయి. ఏదైనా సంపాదకీయం మీకు బావుండకపోతే, సహేతుకంగా విమర్శిస్తూ సంపాదక లేఖ రాయవచ్చు. ఏ విషయాన్నయినాసరే, అన్ని దృక్పధాలనుంచీ చర్చించడమే పత్రికా ధర్మం. పత్రికలు ప్రజా స్వామ్యానికి పట్టుగొమ్మలు.

స్వంతలాభం కోసంగానీ, ఎన్నికల కోసంగానీ నేను ఈ పత్రి

కని ప్రారంభించలేదు. రోజుకి పన్నెండు నుంచి పదిహేను గంటల వాకా ఈ పత్రిక కోసం నేను కష్టపడక తప్పదు. చందాదారులుగా చేరమనో, ప్రకటనలు యివ్వమనో మీ అందరి దగ్గిరికీ నేను వస్తాను. మాకు లాభాలేమీ అక్కర్లేదుగాని, నేనూ నా భార్య ఈ పత్రిక మీద బతకాలి. మా జీవనోపాధికి శ్రమపడుతూ, మీకు చక్కటి విషయాలు వారంవారం అందించగలమని ఆశిస్తున్నాం.

—రాబిన్సన్ మెక్లవిన్.

మా మొదటి సంచిక ఎనిమిది పేజీల పత్రిక. పేజీకి ఆరేసి కాలమ్స్. పత్రిక బయటికొచ్చాక, మళ్ళీ ఒకసారి చదువుకునేటప్పటికి, అచ్చుతప్పులు భయంకరంగా కనిపించాయి. పేజీ మేకప్ ఏమీ బావుండలేదు. ఒక యడ్వర్టయిజ్‌మెంటు తలకిందులుగా పడింది. అయినప్పటికీ, కాకిపిల్ల కాకికి ముద్దులా ఆ పత్రిక మాకు ప్రపంచంలోని అన్ని పత్రికలలోకి అందమైనదిలా కనిపించింది. అనిశ్చయతా, ఆందోళనా పోయాయి. ఒకదారిలో పడ్డాం. చేసేందుకు ఒకపని అంటూవుంది. పత్రిక బయటపడే మొదటి రోజున, నాకు పురిటిగది జ్ఞాపకం వచ్చింది. గంటలకొద్దీ ప్రెస్‌లో నుంచోలేక కాళ్ళు బలపాలు కట్టాయి; పాదాలు వాచాయి. కామెర్లవల్ల బాబ్ యింకా నీరసంగా ఉన్నాడు, ఆఖరి ఫారం మిషన్ మీదకి వెళ్ళేటప్పటికి అతను తూలుతున్నాడు. ఏమయితేనేం, సాధించాం - ఆర్కయివ్‌ని మా రెక్కల్లోకి తీసుకువచ్చాం.

అతను మొదటి సంచికలోని 42 అచ్చుతప్పులూ చూసుకు విచారిస్తూండగా అన్నాను: "నాపేరు లేదేం పత్రికమీద?"

కనురెప్పలు పైకెత్తి అన్నాడు: "ఎడిటర్‌పని నీకేం తెలుసు - నీపేరు వేసేందుకు? పేజీ మేకప్‌నుంచి డిస్పాచి వరకూ సమస్తం నీకు తెలిసేదాకా, నీపేరు వేయడం పడదు."

భర్తకి తోడు నీడగా ఉండటమంటే ఏదో అనుకున్నాను; చాలాదాకా వుందే! - అనిపించింది.

నెలరోజులు అనంతరం నాకు అవకాశం లభించింది. బాగా అలిసిపోయి, 102 డిగ్రీల టెంపరేచరుతో బాబ్ పక్కమీద వున్నాడు.

"ఇలా నేను పక్కమీద పడుకుంటే ఎలా కుదురుతుంది? పత్రిక బయటికి తీసుకురావాలి," అంటున్నాడు బాబ్ మొండిగా.

"పత్రిక ఎందుకాగుతుంది? నేను ఉన్నానుగా," అని ధయిర్యం చెప్పాను.

ఇన్నాళ్ళబట్టీ వాళ్ళమ్మగారి యింట్లో ఉంటున్నాం. ముందు మేము వుండేందుకు ఒకయిల్లు కావాలిగా! నానా శ్రమాపడి యూనివిల్లిఫారంలో ఒక యిల్లు సంపాయించాము. అది డవునింగ్ టవున్‌కి 14 మైళ్లూ, హానీబ్రూక్‌కి

27 మైళ్లొను. సగం సామాను అక్కడికి చేర్చామోలేదో, బాబ్ జబ్బుపడ్డాడు. అతన్నేమో వాళ్లమ్మగారి యింట్లో మిద్దెమీద ఉంచాను; అబ్బాయిని ఒకస్నేహితులింట్లో దిగ బెట్టాను. కత్తి చేతపుచ్చుకుని, తెల్లగుర్రం ఎక్కి తిరుగు తున్న మధ్యయుగపు ప్రభువులా, యిక్కడికి అక్కడికి అని లేకుండా, కీట్స్‌విల్లి, డవునింగ్‌టవున్, వెస్ట్‌ఛెస్టర్ ప్రాంతాలు యడ్వర్టయిజ్‌మెంట్లకని పూర్తిగా గాలించేశాను. నా కప్పటికి అయిదునెలలూ వెళ్ళాయి; మా అమ్మాయి యింకో మూడునెలల్లో పుడుతుంది. నా ఆకారం, నన్నూ చూసి ప్రజలు ఆశ్చర్యపోయి వుంటారు.

స్థానికవర్తకులు వారివారి ప్రకటనలని దగ్గర్లో వున్న రెండు దినపత్రికలకీ పంపిస్తున్నారు. పెద్దగోడని గుండుసూదితో పడగొట్టడంలా అనిపించింది - పత్రికకి వారి దగ్గర్నుంచి యడ్వర్టయిజుమెంటును సంపాయించడం. ఆ వర్తకులలో చాలామంది ఆర్కుయివ్ పత్రిక పేరే వినలేదు యింతవరకూ.

గర్భిణీస్త్రీ వచ్చిందని చాలామంది కనికరించి వుంటారు. ఈవిణ్ని వొదిలించుకోనడమెలా అని, చాలా మంది తమ మొదటి ప్రకటనలు యిచ్చారేమో!

బాబ్ పక్కమీద వుండి ఒకటే గొడవ; ''కవు

న్సిల్ మీటింగు, రోటరీక్లబ్, మహిళా సమితి, యుద్ధ సైనికుల సంఘం–యివేమీ మర్చిపోకు. నాకు తెలుసు నువ్వెంతా తా కలగాపులగం చేస్తావ్!''

''మనిషి లేకపోతే నడవని సంస్థలు సంస్థలేకాదు.'' అని అతన్ని సముదాయిస్తూ, అదరా బాదరా వీధిలో పడ్డాను.

# 7

హాండిల్ బార్ లేని సైకిల్ తొక్కుతున్నట్టు వుంది. నాపని – ఆరాత్రి పేపరు ప్రెస్ కి వెళ్తున్నప్పుడు. స్నేహితులింట్లో వున్న అబ్బాయిని, వాళ్ల అమ్మగారింట్లో దిగవిడిచాను. అక్కడనుంచి వాణ్ణి యూనియన్ విల్లి తీసుకొచ్చి, మరొకళ్ళ యింట్లో వుంచాను. అక్కడనుంచి హానీబ్రూక్ పరిగెత్తాను మా కారులో. సన్నసన్నటి గాలీ ప్రూఫులు పేజీరూపం ఎలా దాలుస్తాయో నాకు పాలుపోవడంలేదు – మహా గందరగోళంగా ఉంది. మార్టిన్ లియాండిస్ నాకా రోజున ఎంతో సహాయం చేశాడు. ప్రూఫులు ఎలాదిద్దాలో దగ్గిరనుంచి, ఫారాలు కట్టడం దాకా నేర్పాడు.

పత్రిక పూర్తయేటప్పటికి అర్ధరాత్రి దాటింది. అన్నీ చెప్పినట్టు చేశానా, లేక ఏమయినా మర్చిపోయానా అని

బుర్రగోక్కుంటున్నా. నా ప్రదానపుటుంగరం యింకా చిటికిన వేలికే ఉంది. అంటే, ఏదో మర్చిపోయినట్టు నన్నమాట. జేబుల్లో చేతులుపెట్టుకు తడుముకు ఒక కాయితం బయటికి తీశాను. నాలుగు అంగుళాల యడ్వర్టయిజ్మెంటు - కొత్త యడ్వర్టయిజర్ యిచ్చాడు. నాలుగంగుళాలంటే, అంగుళానికి 30 సెంట్లు చొప్పున ఒక డాలరు యిరవై సెంట్లు నష్టపోయామన్నమాట. కిందటి నాకొట్టు బాకీ కొద్దిగా అయినా పేరి వుండేది. బాకీమాట అటుఉంచి, ఆ యడ్వర్టయిజర్కి ఏం సమాధానం చెప్పేది? కాళ్ళు తేలిపోతున్నాయి; తల తిరుగుతోంది; కళ్ళు మండుతున్నాయి; నాకు తెలియకుండానే కన్నీళ్లు కారుతున్నాయి. ఎడిటర్ పని ఈ జన్మకి చెయ్యలేనని అనుకున్నాను.

ఆ పై వారం నేను బయటికి కదలడానికి వీలులేక పోయింది. సామానంతా పూర్తిగా యూనియన్ విల్లికి చేరవేశాం. బాబ్ యిటు డవునింగ్టవున్లోనో, అటు హాసిబ్రూక్లోనో. మధ్యని యూనియన్విల్లిలో నేను. ఆ రోజుల్లో మా దో సంసారమా - ఎగిరే కాయితపు బంతుల్లా వున్నాం గాని! ఇంతలో మియా జన్మించింది.

పత్రిక వెలువడవలసిన రోజునే అదీ పుట్టింది.

మరుసటివారం మా అమ్మాయి జనన వార్త వేస్తూ

కంపోజిటర్ అన్నాడు: "అసలు ఆ అమ్మాయి 'యింపోజింగ్ స్టోన్'మీద పుట్టి వుండాల్సింది."

నేను పురిటి గది నుంచి బయటికి రావడం, బాబ్ ఆవారం పత్రిక పుచ్చుకు ప్రత్యక్ష మవడం రెండూ ఒకే సారి జరిగాయి.

నవ్వుతూ పత్రిక నామీదికి విసిరాడు.

ఎడిటోరియల్ పేజీ చదువుకున్నాను. ఇలా వుంది.

మళ్లీ స్వవిషయం

పురుషులు తాము స్త్రీలకంటె జ్ఞానసంపన్నులమని అనుకోవడం సర్వసహజం. స్త్రీ పురుషులు సమానులని న్యాయచట్టం అననచ్చు; కాని పురుషజాతి ఆవిషయాన్ని అంతర్యంలో నమ్మదు. తను అధికుణ్ణి అనుకోవడంవల్లనే పురుషుడు జీవించగలుగుతున్నాడు, అదే అతనికి జీవసూత్రం. ఆ విశ్వాసం పోయిననాడు అతను రాణీసాహెబావారి సేవకుడవుతాడు; మనందరం జాలిపడవలసిన వాడవుతాడు. భార్య చెప్పుచేతలలో మెలిగే దద్దమ్మ అవుతాడు. అంటే చేతకానివాడన్న మాట.

తెలివిగల స్త్రీ తన భర్తను దద్దమ్మ కానివ్వదు. పురుషుని అహాన్ని కాపాడుతూ, తను తరుచు అసహాయురాలిగా కనపడుతుంది. ఈ అసహాయురాలిని రక్షించేందుకు పురుషుడు పరిగెడుతాడు. ఆమెకి కావలసిన సలహాయిస్తాడు. ఈ స్త్రీ కూడా రాణిలాంటిదే! ఇటువంటి రాణిని సంతోషపెట్టేందుకు పురుషులు ఎంతైనా సేవజేస్తారు; కాని ఆసేవలో అనురాగం ఉంటుంది.

ఒకరోజు 102 డిగ్రీల టెంపరేచరుతో యింటికొచ్చాను. ఆవేళ సోమవారం. బుధవారం నాటికి ఎనిమిది పేజీలపత్రిక అవాలి. నేను పక్కమీద పడిపోయాను - ఏమీ చెయ్యలేను. కాని గురువారంనాటికి యథాప్రకారం పత్రిక మార్కెట్లోకి వచ్చింది. ఆశక్తుణ్ణాయి నేను పక్కమీద పడివుండగా, జేన్ మేటరురాసింది, పత్రిక కంపోజ్ చేయించింది, అచ్చువేయించింది.

అంచేత, ఆమెపేరుకూడా ఎడిటర్‌గా వేస్తున్నాను. ఇకనుంచి "నేను" కాదు - "మేము".

# 8

పత్రిక పేజీలు మడనడ మనేది తమషా అయిన తంతు. ఒకరోజు రాత్రి, ఆ దారినపోయేరైతు, ప్రెస్ గుమ్మం దగ్గిర నిలబడి - యిక్కడ మడతపని వున్నట్టుందే !- అన్నాడు.

పత్రికలు మడవాలనే సంగతి నాకు తెలియదు. మిషన్‌లోకి వెళ్లి, వాటంతటవే మడవబడి, వస్తాయనుకునేదాన్ని. పెద్దపెద్ద పత్రికలు అంతేటగాని. మాహానీబ్రూక్‌లో అటువంటి యంత్రాలు లేవుట. మేమింకా బెంజమిన్ ఫ్రాంక్లిన్ దినాలలోనే ఉన్నాం, తప్పని సరిగా అవసరమయ్యే సామానుమట్టుకే వుంది మా ప్రెస్‌లో.

మూడు పత్రికలు ప్రింటవుతున్నాయి అక్కడ.

లక్షా యిరవై వేల కాయితాలు ప్రతివారం మడవాలి, మా ఒక్క ఆర్కైవ్ పత్రిక మడతపని మూడు గంటలనుంచి ఎనిమిది గంటలసేపు పట్టేది. మడిచే వాళ్ళ సంఖ్యని బట్టి, మాట్లాడుకునే విషయాల్నిబట్టి పని తొందరగా తెమిలేది. బుధవారం రాత్రి హైస్కూలు పిల్లలు వచ్చి సాయం చేస్తూండేవారు.

మా బైండర్ బాయిస్ వయస్సు పద్నాలుగు డెబ్బయి మధ్య ఉండేది. హైస్కూలు పిల్లలతో పాటు నా మేనత్త లిద్దరుకూడా వచ్చేవారు. ఆంట్ జెన్నీకి (నా మేనత్త) అయిదుగురు పిల్లలు. పదిహేనుగురు మనుమలు. చేతికి తగ్గ పనిలేదు. ఎవరికైనా ఏదైనా సహాయం చేస్తాను - అంటూండేది ఆంట్ జెన్నీ. ఇక వాళ్ళ రెండో మేనత్త ఆంట్ఫానీకి బాగా చెముడు - కాని, ఆవిడకి మొక్కలు పెంచడమంటేనూ, తోటపని అంటేనూ చాలా సరదా. గార్డెనింగ్లో ఆమెకి ఎన్నో ప్రయిజులొచ్చాయి. ప్రతివారం పువ్వులకి. మొక్కలకి సంబంధించిన కొత్త విషయాలు కనిపెడుతూ వుంటుంది. ఒకరోజు రాత్రి కాయితాలు మడుస్తున్నప్పుడు ఎర్ర టొమాటోలు మంచివా, ఆకుపచ్చ టొమాటోలు మంచివా అను వాగ్వాదం వచ్చింది. "నీ రక్తం ఎలా ఉంటుందో, దానినిబట్టి తెలుసుకోవచ్చునే!" అంది ఆంట్

షాన్. ఒకరోజు కమ్మరిపురుగులు తీసుకొచ్చి, వాటిగురించి అరగంటసేపు చెప్పింది.

మడతపని ప్రారంభమవడమేమిటి—యింక తెగవాగుడే! మిషన్ శబ్దాన్ని అధిగమించి వినిపించేందుకు, రేడియోని ఫుల్ వాల్యూమ్‌లో పెట్టేస్తాం. అటు మిషన్ శబ్దం, యిటు రేడియో హోరు - ఈ రెండిటినీ మించి వినిపిస్తూంటుంది ఆంట్ షాన్‌గారి ఉపన్యాసం.

రేడియోలో ఏమి ట్యూన్ చెయ్యాలా అనేది ఎప్పుడూ వివాదగ్రస్తము! బాబ్ ఏమో వార్తలు పెట్టమంటాడు; కొందరు శాస్త్రీయ సంగీతం పెట్టమంటారు; మరికొందరు వాద్యసమ్మేళనం పెట్టమంటారు; పిల్లలేమో "జాజ్" పెట్టమంటారు. ఏమయితేనేం, మొత్తానికి అంతా తలో కాస్త. ఏ ఒక్క కార్యక్రమం పూర్తిగా వినడం పడదు. హాక్‌బ్రూక్‌లోని రేడియో మార్కోని మొదటి రోజుల్లోది; అంచేత, అది అప్పుడప్పుడు ఆగిపోతూంటుంది. అలాటప్పుడు కరువుతీరా కబుర్లు.

ఒక లక్ష్యసాధనకి కావలసిన మైత్రి గురించి చెప్పుకోవలసివస్తే, పత్రిక మడవటం గురించి చెప్పాలి. అది చాలా కష్టమైన పని. కాని పని చేసేవాళ్లు ఆడుతూ పాడుతూ చేసేస్తారు. ఒక్కో రోజున నాపాదాలు ఎంత

వారుమునకు పోయేవంటే, జోళ్లు విప్పేసి, మేజోళ్లతో తిరిగే దాన్ని ప్రెస్‌లో.

ప్రతివారం ఒక యజ్ఞం అంటే నమ్మండి!

నేను యడ్వర్టయిజ్‌మెంటులు చూసుకుంటూవ న్నాను. అబ్బాయిని బళ్ళోవదిలి పెట్టి, అమ్మాయిని కార్లో వేసుకు, వెళ్లవలసి వస్తూండేది యడ్వర్టయిజ్ మెంట్లకి.

అమ్మాయి చంటిపిల్ల గదా? ఆకలేసి అప్పుడప్పుడు ఏడుస్తూ వుండేది. అమ్మాయి పాలసీసా ఎప్పుడూ కారులో ఉండేది. పది పదిహేను నిముషాల వ్యవధి వున్నప్పుడు క్లారెన్స్‌షాపులోకి వెళ్లికూచునే దాన్ని. పాప పాలు తాగుతూండగా, నేనూ క్లారెన్సూ ఆవారం రావలసిన యడ్వర్ట యిజ్‌మెంటు గురించి మాట్లాడేవాళ్లం. యడ్వర్టయిజ్ మెంటుతో పాటు అతని సంసార తాపత్రయం చెప్పుకునే వాడు.

మొదటి సంవత్సరంలో ఆర్కుయివ్ గురించి చాలా కొద్దిమందికే తెలిసింది; ఆ తెలిసిన కొద్దిపాటీకూడా పత్రికకి లాభదాయకమైనదికాదు. "పత్రికల్లో ప్రకటన లెందుకు దండగ" అనేవారు. కొందరు నాజూకుగా చెప్పేవారు; కొందరు కటువుగా చెప్పేవారు. కాని, మొత్తంమీద అందరు చెప్పిందీ అదే!

''నా షాపు పేరు, నేను డబ్బిచ్చి, ఎందుకు వేయించుకోవాలి మీపత్రికలో? నాషాపు యిక్కడ ముప్ఫయియిదేళ్లబట్టి – మా నాన్న కాలంనుంచీ – ఉంది. చుట్టుపట్ల అందరికీ తెలుసు, మా షాపు ఎక్కడ వుందో!''

లేకపోతే యిలా: ''మీ పత్రికకి సర్క్యులేషన్ ఎంత వుందని మీకు యడ్వర్టయిజ్‌మెంటు యిచ్చేందుకు? యడ్వర్టయిజ్‌మెంటు యివ్వదలుచుకుంటే, 12,000 మంది చదివే దినపత్రికకి యివ్వక, మీకిచ్చేందుకు నాకేమయినా మతి పోయిందనుకున్నారా?''

ఎండఅనక, వానఅనక – ఎక్కేగుమ్మం, దిగేగుమ్మం. విసుగెత్తి నిస్పృహ చెందాను. ''ఏదో వాళ్లు శ్రమపడుతున్నారు; కాస్తచేయూతనిద్దాం,'' అని ఒక్కళ్ళూ అనుకోరే! ఆర్క్యయిన్‌కి అవకాశం యిస్తేగదా దానిప్రతిభ రుజువయ్యేందుకు!

ఈ నిరాశామయ ప్రపంచంలో మిస్ ఓలా ఒక్కత్తే నాకు కాస్త సంతోషాన్ని యిచ్చింది. మిస్ ఓలా పొట్టిగా లావుగా ఉంటుంది. బ్రహ్మచెముడు – కాని, మాంచి తెలివిగలది. గ్రిఫిత్స్ అను కంపెనీలో, పుస్తకాల బీరువాలపై అజమాయిషీ ఉద్యోగమామెది. గ్రిఫిత్స్‌లోకి వెళ్ళినప్పుడు. మామూలుగా పలకరించవలసిన వాళ్లని పలకరించి, తిన్నగా ఆమెదగ్గిరికి వెళ్ళేదాన్ని.

గ్రిఫిత్స్ చాలా పాతసంస్థ. వందేళ్ళబట్టీ ఉంటోంది అక్కడ. వారి దగ్గిర దొరకనివస్తువంటూ లేదు. పూల మొక్కల దగ్గిర్నుంచి, ఫేషనబుల్ డ్రెసెస్ దాకా సమస్తం దొరుకుతాయి. గ్రిఫిత్స్ ఎంత పెద్దదంటే, వాళ్ళ షాపులో వున్నవన్నీ వాళ్ళకే తెలియవు. పురాతనవస్తువులకి అటకలుకట్టి, వాటిమీద పేర్చారు. అవి కావలసిన 'కస్టమర్' నిచ్చెన మెట్లెక్కి, సాలిగూళ్ళకి చీదరించుకోకుండా. తనకి కావలసిన వస్తువు ఏరుకోవచ్చు. అన్నిటికీ ధరలు వస్తువులమీద వేసి ఉండవు; గుమాస్తాలు తొందరగా మనమాట వినిపించుకోరు; ''దానికి డబ్బు పుచ్చుకోండరోయ్'' - అని మనం అరవవలసివస్తుంది. సరసుడూ సహృదయుడూ అయిన ఎల్డర్ గ్రిఫిత్ రెండుచేతులూ చాచి, ''అయ్యో, దాని ధర నాకూ తెలియదు. ఒక ఏభై సెంట్లు పడేసి వెళ్ళండి - సరిపెట్టించేసాను,'' అంటాడు.

యడ్వర్టయిజ్ మెంటుల విషయం వచ్చినప్పుడు అతనంటాడు: ''మిస్ ఓలాని చూడండి. ఆమె ఎలా చెబితే అలాచేసెయ్యండి - దాని దేముంది?'' ఎంతో చక్కగా చెబుతాడు.

పెట్టెల్లాంటి గదులు దాటుకుంటూ, చివరనున్న మిస్ ఓలాదగ్గిరకి వెళ్ళాను. రసీదులూ పద్దుల పుస్తకాలూ ముందేసుకు కూచుని వుంటుంది మిస్ ఓలా.

ఎప్పటి కప్పుడు కొత్తే ఆమెకి! ఊరుచివరి దుబ్బుల్లో నుంచి, తిన్నగా యిక్కడి కొచ్చిన దయ్యాన్నేమో అన్నట్టుగా చూసేది.

పేపర్లు యిటూ అటూ సర్దుతూ, "ఇంకా ఏమీ తయారు చేయలేదు. ఈ వారం కొత్తగా వచ్చినవి కదూ! చేపలు పట్టేటప్పుడు వేసుకునే బూట్లూ, యిల్లు దులుపుకునే దుమ్ముచీపుర్లూ, కొత్త రకం పెయింట్లూ, చిక్కుడు విత్తనాలు..." అంటూ మధ్యలో ఆగిపోతుంది.

"అంతేనా, యింకా ఏమయినా వున్నాయా?"

ఆమెకి వినిపించదు.

"ఇంకా ఏమయినా వున్నాయా?" అని గట్టిగా అరుస్తాను – ఇక లాభంలేదని.

చెవి నా వైపుగా తిప్పి, "ఏమిటి?" అంటుంది.

"ధరలు" అని బిగ్గరగా నేను.

కాయితం మీద రాస్తాను.

ధరలకేం ఫరవాలేదు. చిక్కుడు విత్తనాలు వచ్చాయని రాస్తే చాలు. ఇది వాటికి సీజన్."

ఆమె చెప్పినవాటిలో ఏవి ఎంతవరకు యడ్వర్టైజ్మెంటుగా వేయాలి, ఏవి వార్తలుగా వేయాలి – అనేది

సమస్యే! ఒకదానిలో ఒకటి కలిసిపోయి వుంటాయి. ఏమైనా, బిల్లు విషయంలో యిబ్బంది లేదు. ఇది యింత ఎందుకయింది, అంత ఎందుకయింది? - అను పేచీలు లేకుండా, మేము పంపిన బిల్లు మొత్తానికి నెలాఖరు అయ్యే వేళకి చెక్కు వచ్చేస్తుంది.

సహనమనేది నా సహజగుణాల్లో ఒకటి కాదు; కాని, యడ్వర్టయిజింగ్ వల్ల అది నేర్చుకోక తప్పిందికాదు. యడ్వర్టయిజర్లు వుట్టినే కూచోపెడుతున్నప్పుడు ఎంతో ఓర్పు ప్రదర్శించవలసివచ్చేది. ఒక జోళ్ళషాపు మేనేజరు తను జోళ్ళపెట్టె సర్దుకుంటూ, నన్ను 45 నిమిషాలపాటు కూచోబెట్టి, ఆఖర్న తనకి మా పత్రికలో యడ్వర్టయిజ్ చేయాలని లేదన్నాడు. ఉండబట్టలేక నాలుగూ పెట్టాను. ఆ మాట కాస్తముందే చెప్పొచ్చుగా!

ఆఫీసుకొచ్చి బాబ్‌కి ఆసంగతి చెప్పేవేళకి 'అలాగా' అని వూరుకున్నాడు. స్త్రీలు కొద్దిగా బయటపడేటప్పటికి, పురుషులు తమ ఆధిక్యతని నిరూపించు కోడానికి వెనుకాడరు.

"యడ్వర్టయిజ్‌మెంటులు తీసుకు రావడమనేది నీ బాధ్యత. వర్తక ధర్మంలోని మొదటి సూత్రం ఏమిటంటే, కస్టమర్ ఎప్పుడూ రైటే. నీ విషయంలో

కస్టమర్ అనేవాడు యడ్వర్టయిజర్. నువ్వు అతనికి మన పత్రికలో స్థలం అమ్ముతున్నావు ; అతనికి యిష్టమయితే కొనుక్కుంటాడు ; లేకపోతే లేదు. ఓర్పు మనకి వుండాలి గాని యితరులని అని లాభం లేదు. ఎవరో మొరటుగా ప్రవర్తించారని మనమూ అలా వుంటే ఎలా ? మొరటుదనాన్ని సౌమ్యతతోటే శిక్షించగలం."

శాబ్ మాటలకి మొదట కోపం వచ్చినా, విజయ సాధనకి ఆ సౌమ్యమార్గమే రాజబాట అని తెలుసుకున్నాను.

ఏ జోళ్ల కంపెనీ మేనేజరు నన్ను 45 నిముషాలు వుట్టినే కూచోపెట్టాడో, అతనే చివరికి మా పత్రిక [illegible] యడ్వర్టయిజర్స్‌లో ఒకడయ్యాడు.

నగలవర్తకుని షాపుకి మధ్యాహ్నం వేళగాక పొద్దుటినే, అతని భార్యసణుగుడు ప్రారంభించక పూర్వ, అతని పాదాలమంటలు ప్రారంభం కాక పూర్వం వెళ్లడం మంచిదని గ్రహించాను. ఎరిస్కిన్ దగ్గిరకెళ్లి నప్పుడల్లా, వాళ్లబ్బాయి చదువు విషయం అడిగేదాన్ని. బాగా చదువుకుంటున్నాడని అతను అంటే, ఎనిమిది అంగుళాల యడ్వర్టయిజ్‌మెంటు ఖాయం. స్కూలు అధికారులు ఆ అబ్బాయిని యింటికి పంపించేసివుంటే, [illegible] యడ్వర్టయిజ్

మొంటు అడిగి లాభంలేదు - వృథా. చిన్న పట్నంలో పత్రిక అంటే, నలుగురితో కలిసిమెలిసి పోగలవాలి. వారికి మనమీాద యిష్టం కలిగేటట్టు చేసుకోవాలి. అంతేగాని, మన పత్రిక లక్షకాపీలు అమ్ముతున్నప్పటికీ, చిన్న పట్నంలోని యడ్వర్టయిజర్ రెండు అంగుళాల ప్రకటన కూడా యివ్వడు - మనమంటే యిష్టపడకపోయిన పక్షంలో, పత్రికా ప్రచారం కాదు, - వ్యక్తిగత బాంధవ్యం ప్రధానం.

## 9

పెద్ద పత్రిక లెప్పుడూ ప్రజాకర్షణకోసం, ప్రమాదకరమైన దుర్వార్తలకి ప్రాముఖ్యత నిస్తాయి. అందుకనే, సాధారణ పాఠకుడు దానివంక కాసేపుచూసి, చదువుకునేందుకు మట్టుకు వారపత్రిక చేతబుచ్చుకుంటాడు. సుశిక్షితులూ సద్వర్తనులూ అయిన పౌరుల కార్యకలాపాల గురించి ఉంటుంది ఆ వారపత్రిలో,

మహిళా సమితి గురించీ, కవున్సిల్ మీటింగు గురించీ ప్ర వారానికావారం కొత్తగా రాయడం మాటలుకాదు. ఊహాగానం చేయడం బాగా చేతనైవుండాలి. ఏ వార్తనైనాసరే, ఆకర్షణీయంగా ప్రకటించాలి. మేము కొత్త పోకడలు పోయేటప్పటికి కొందరు అనుమానాస్పదంగా

చూశారు. కొన్ని స్థానిక పారిశ్రామిక సంస్థల వాళ్లు, తమ గొప్పలు ప్రచురించేందుకే పత్రికలు వున్నాయను కుంటారు.

మేము పత్రిక కొనేటప్పటికి, రెండు సొరుగుల నిండా ఫొటోబ్లాకులు వున్నాయి, ఆ ఫొటోబ్లాకుల మధ్య ఒక ఎలక నివాసం చేస్తోంది కూడాను. ఎప్పుడో చనిపోయిన గ్రామాధి కారి దగ్గిరనుంచీ, ఈ మధ్య చనిపోయిన డాక్టరు దాకా వున్నాయి ఆఫొటోబ్లాకులు. డవునింగ్‌టవున్ పట్నపు చరిత్ర అంతా మా ఆఫీసులో వుండవచ్చు. ఆర్క్యయివ్ పత్రిక 1875 లో స్థాపించబడింది. ఫొటోగ్రాఫర్ ఖర్చులేకుండా బొమ్మలు దొరికాయిమాకు. ప్రతివారం ఒకఫొటో వెయ్య డం – గురువారం ఉదయం 9 గంటలు దాటినతర్వాత వచ్చి, ఆఫోటో ఎవరిదో చెప్పగలిగిన మొదటి మనిషికి ఒక ఏడాదిపాటు ఆర్క్యయివ్ పత్రిక ఉచితంగా లభిస్తుందనడం. జనాకర్షణకి అదొక మార్గం – అనుకున్నాం.

మొదటివారం వందమంది వచ్చారు – మేము ప్రచు రించిన ఫొటో ఎవరిదో చెప్పేందుకు. ఆతర్వాత, గురు శుక్ర శని వారాలు మూడురోజులూ రెండేసి వందలమంది వచ్చేవారు. "మిస్టరీహవుస్" ఒక్కటితప్ప, మిగతా బొమ్మలు ఎవరెవరివో ఒక స్థానిక చరిత్రకారుని సహాయం

తో, మేము ముందే తెలుసుకున్నాం. ఆ "మిస్టరీహావుస్" మట్టుకు ఎక్కడిదో ఎవరూ యింతదాక చెప్పలేకుండా ఉన్నారు. సంవత్సర ప్రారంభాన ఆ బొమ్మవేసి, "మిస్టరీ హావుస్" ఏమిటో ఎక్కడో చెప్పగలిగిన వారికి 50 సెంట్లు బహుమతి అని ప్రచురిస్తున్నాం ప్రతిఏడూ.

ఈ "మిస్టరీ హావుస్" గురించిన వాద ప్రతి వాదాలు పత్రిక వొచ్చినరోజు వుదయం ప్రతిచోటా విని పిస్తాయి. ఆఖరికి పోస్టాఫీసులోకూడా పోస్టుమాన్, పోస్టు మిస్ట్రెస్, పౌరులు కలిసి వాదించుకుంటూ వుంటారు. ఫలానా రాక్ రావెన్ మార్గంలో ఉందని ఒకరూ, 1930 లో తగులబడిపోయిన లిన్ హావెన్ స్టోర్స్ అని మరిఒకరూ – యిలా రకరకాలుగా ఆమిస్టరీ హావుస్‌ని పోల్చుకోబోతారు. ఒకరోజురాత్రి, ఒక చందాదారు మాకు ఫోనుచేసి అడి గాడు: "అది ఎక్కడుందో మీరయినా చెబుదురూ – ఎవరికీ తెలియని బొమ్మవేసి మమ్మల్ని యిలాచంపడం న్యాయంలేదు."

మిస్టరీ హావుస్ ఫలానాచోట వుందనీ, అదిఫలానా వారియిల్లు అనీ సూచనలు వస్తూండేవి. ఫోటోగ్రాఫరుని పంపించి దాని బొమ్మతీయించి, అచ్చువేసేవాళ్లం. ఫోటో తీయించడం, బ్లాకు చేయించడం – దీనంతకీ చాలా ఖర్చు

గాడు. కాని, పాఠకులు యిందువిషయమై ఎంతో ఆసక్తి కనబరిచేవారు. అంచేత నాలుగు డబ్బులు ఖర్చయినా కష్టం తోచేది కాదు.

ఇక యడ్వర్టయిజ్ మెంట్ల విషయంలో ఒక తమాషాపద్ధతి అవలంబించేవాళ్లం. ఏచందాదారు పేరు గనుక తన యడ్వర్ట్ యిజ్ మెంటులో కనిపిస్తుందో, ఆ చందాదారుకి ఒక డాలరు విలువగల వస్తువులు ఉచితంగా యివ్వమని యడ్వర్ట్ యిజర్లతో ఏర్పాటు చేసుకునేవాళ్లం. ప్రతివారం చందాదారుల లిస్టులోనుంచి, ఏదో ఒక పేరు కళ్లుమూసుకు తీసి, ఏదో ఒక యడ్వర్ట్ యిజ్ మెంటులో యిరికించేవాళ్లం. ఇందువల్ల రెండు ప్రయోజనాలు. ఎంత చిన్న అక్షరాలలోవున్న యడ్వర్ట్ యిజ్ మెంటు అయినా సరే, చందాదారులందరూ తమ పేరు వుందేమో, తమకి డాలరు వస్తుందేమో - అని చదువుతారు. తమ పేరు లేనప్పుడు, మేమేదో పక్షపాతం చూపిస్తున్నామనీ, దగ్గరవాళ్లకే యివి ముట్టజెపుతున్నామనీ - యిటువంటి ఆరోపణలు లెక్కలేనన్ని వచ్చేవి. ఒకసారి ఒకావిడకి మామీద చాలాకోపం వచ్చింది. ఆమె పేరు పుష్పాల ప్రకటనలో ఉంది.

''పువ్వులా - వెధవపువ్వులు! పువ్వులంటే నాకు

మహా అసహ్యం. నా మనమడికి ఒక ఆటవస్తువు కొని యిద్దా మనుకుంటే, మీ పుష్పాల ప్రకటనదారు పువ్వులుతప్ప యింకేమీ యివ్వనంటున్నాడు. ఇదేమి అన్యాయం? నా మనమడికి ఆటవస్తువు కొనుక్కోకూడదా నేను?'' అంటూ టెలిఫోనుమీద మమ్మల్ని దుయ్యబట్టుకుంది. మా నవ స్వభావం ఎలాటిదంటే, మనం బటాణీగింజలు పంచిపెడుతూ వుంటే, పచ్చలు (Emeralds) ఎందుకు పంచిపెట్టడం లేదని అడుగుతారు.

హైస్కూలు పిల్లలకి ''డిజ్జీ'' అను ఒక అమ్మాయి వీక్లీ కాలమ్ రాస్తూండేది. డిజ్జీ అంటే, ఆమె టీచర్లకి మినహా, మిగతా పిల్లలందరికీ యిష్టం. ఆమె రాసేమాటలు కొన్ని మాకు అర్ధమయేవి కాదు; కాని, స్కూలు పిల్లలకి బాగా అర్ధమయేవి. అంచేత, ఒక్క ముక్కకూడ తీసెయ్యకుండా, ఆమె రాసినది రాసినట్టు అచ్చుకిచ్చేవాళ్లం. ఒకసారి ప్రిన్సిపాల్ నచ్చి ''స్టు'' (Stew) లో జడపిన్ను కనపించిందని రాయడం తమకి అప్రతిష్ట అంది. ''నిజమేగాని, ఆ మాటల్లో ఆ అర్ధం వుందని మీరు చెప్పేదాకా మాకే తెలియదు – మిగతా పెద్ద వాళ్లకి మాత్రం ఏమర్థ మవుతుంది లెద్దురూ! డిజ్జీ రాసేదేమిటో అర్ధం కాదు గనక, పెద్ద వాళ్లెప్పుడూ ఆకాలమ్ చదవరు'' అని ఆమెని సంతృప్తి పరిచి పంపించేశాడు బాబ్.

మా పత్రికలో సంగ్రహ ప్రకటన లొకటి — మహా తమాషాగా ఉండేవి. ఆర్క్యాయివ్ ని వృద్ధిలోకి తీసుకొచ్చేందుకు మాకు బోలెడన్ని ఐడియాస్ ఉండేవి; కాని, వాటిని ఆచరణలో పెట్టేందుకు టైము వుండేది కాదు. టెలిఫోను సంభాషణ, వార్తా సేకరణ — వాటి మధ్య యమవేగంతో రాసేవాళ్లం, ఆ రాయనలసినది కాస్తా. చివరికి ఈ ప్రకటన వేశాం :

"చాలా ఉత్సాహవంతమైన ఉద్యోగం-పర్మనెంటు ఉద్యోగం-ఆర్క్యాయివ్ పత్రికలో ఖాళీగా ఉంది. స్త్రీగాని పురుషుడుగాని - వయసులో వున్నా వయసు మళ్లినా, ఎదిగిన మనిషి (Mature) అయితే చాలు, మాకు పనికొస్తారు. బాధ్యత నెత్తిమీద వేసుకోవాలి. టైపింగూ పద్దులు రాయడమూ వచ్చి వుండాలి. అన్నిటికీ మించి, ఆఫీసు టైము ఉదయం 9 గంటలనుంచి సాయంత్రం 5 గంటల దాకా మాత్రమేనని అనుకోని మనిషై వుండాలి. పై ఉద్యోగం కావలసినవారు, ఎడిటర్ ని స్వయంగా వచ్చి చూడవచ్చు. దరఖాస్తులు అనవసరం."

మా ప్రార్థనలకి సమాధానమా అన్నట్టు బార్బరా హిల్ మాన్ వచ్చింది. ఆమె హైస్కూలు లెక్కల మేస్టారి పెళ్లాం. బార్బరా అయిదేళ్లపాటు, మా బరువులో కొంత, తన నెత్తిని పెట్టుకుంది. మిగతా ఆర్టికల్స్ రాసుకునేందుకు, యింటర్వ్యూలకి నాకు కొద్దిగా వ్యవధి దొరికింది.

బార్బరాకి సంగ్రహ ప్రకటనలంటే చాలా యిష్టం.

మా పత్రికలో ప్రవేశించాక, ఏడు వారాలపాటు ఒక చక్కటి ప్రకటన వేసింది - వ్యక్తిగత ప్రకటన (Personal) అను హెడ్డింగ్ కింద.

మొదటి రెండు వారాలూ ఈ విధంగా:

"డోరిస్ : ఇంటికి రా. ఇంత చిన్న కారణానికిగాను, నువ్వు యిల్లు వొదిలి వెళ్ళిపోవడం ఏమంత మంచిపని! ఇల్లు నానా గందరగోళంగానూ వుంది. పిల్లలు నీ కోసం బెంగపెట్టుకున్నారు. ఆర్థర్"

"డోరిస్ : నువ్వు ఎక్కడ వున్నావో వెంటనే తెలియపరుచు. అందరూ ఆందోళన పడుతున్నారు - ఆర్థర్"

ఆఖరి వారం ప్రకటన :

"డోరిస్ : ఒప్పుకుంటాను. నువ్వే నెగ్గావు. ఆర్క్యుయిస్ పత్రికకి చందా కట్టాను. నీకు కావలసిన వార్తలూ విశేషాలూ చదువుకోవచ్చు. ఇప్పుడైనా, నామాట విని, యింటికి రావూ? - ఆర్థర్"

నేను ఆర్క్యుయిస్ గురించి యిటువంటి ప్రకటన రాశాను :

**అమ్మాయిలు - ఆర్క్యుయిస్**

మునుపటికంటె ఆరోగ్యంగాను, శక్తివంతంగాను ఉన్నారు. ఒకసారి కన్నెత్తి చూస్తే చాలు - ఆ అందచందాలు అగుపిస్తాయి. పాతబడిపోతే ఎవరికీ అక్కర్లేదు. వెళ్ళినచోటుకల్లా వార్తలు మోసుకు వెళ్తారు - కాని మనసు విప్పి నిర్మొగమాటంగా చెప్పరు; ఎంత చెప్పడం మంచిదో అంతే చెబుతారు. ప్రతివాళ్లూ తమకొకటి ఉండాలను కోవాలిగాని పక్క చూపులు చూడ కూడదు. అంచేత, ఆర్క్యుయిస్ కి నేడే చందా కట్టండి.

# 10

విలియమ్ యాల్లెన్ వైట్ ఒకసారి రాశాడు: చివరికి మిగిలేది ప్రజాభిప్రాయమేనని. ఈ ప్రజాభిప్రాయం వుంది చూశారూ, యిది అందీఅందనివస్తువు. యడ్వర్టయిజర్లు మనకి యడ్వర్టయిజ్‌మెంటు యిచ్చినట్టే మాట్లాడుతారు - కాని యివ్వరు. అలాగే, పాఠకులకి వారివారి స్వంత అభిప్రాయాలు వుంటాయనీ, వారి దృక్పథమూ వారి అభిప్రాయాలూ కాలక్రమేణా వారు తెలుపుతారనీ మేము అనుకుంటూ వచ్చాం. కొత్తశీర్షికలు ప్రవేశపెట్టాం; ఒకసంచిక కంటె మరొక సంచిక బావుండాలని కృషిచేస్తున్నాం; మా శక్తికొద్దీ శ్రమపడుతున్నాం. బజారు అమ్మకం పెరుగుతున్నంతసేపూ మా పత్రిక గురించి ఎటువంటి వ్యాఖ్యానాలూ రాలేదు; బాగానే వుందనుకున్నాం. కాని, ప్రజాభిప్రాయమేమిటో తెలుసుకునే నావకాశం మాకు లేకపోయింది.

ఒక్క మొదటి నెలతప్ప, ఆ తర్వాత పత్రిక స్వయంపోషకంగా అయింది. హాస్‌బ్రూక్‌లోని ప్రింటింగ్ బిల్లూ, మా యింటి ఖర్చూపోను కొద్దిగా మిగిలేది. ఏ నెల ఖర్చులు ఆ నెలకి సరిపడితే చాలుననే గాని, డబ్బుమిగలాలనే తృష్ణ లేదు మాకు; మా బాధ ఎంతకీ ఆర్కయివ్ గురించే!

వివాదగ్రస్తమైన ఒకవిషయంలో, మేము యిటు వంటి సంపాదకీయం రాశాం :

తల దూర్చడం

మన రాజ్యాంగ ప్రణాళికలో ఒకానొక సవరణని ప్రవేశపెట్టే నిమిత్తం, మన ప్రజలందరూ నవంబరు 8 వ తేదీన ఓట్లు వెయ్యడా నికి వెళ్తారు. యుద్ధభూమి నుంచి తిరిగి వచ్చినవారికి (Veterans) 50 కోట్ల డాలర్లు పంచిపెట్టే నిమిత్తం ఈ సవరణ.

నేనూ వెటరన్నే. యుద్ధరంగంలో అయిదేళ్ళపాటు వుండి వచ్చాను. నాకూ 500 డాలర్లు వొస్తుంది. యుద్ధానంతర కాలం లోని శ్రేయోరాజ్యంలో, చిన్నవ్యాపారం నడుపుకుంటూ, అందులో సతమతమవుతున్న నాకు 500 డాలర్లు స్వల్పమొత్తం కాదు; సంతో షించవలసినంత మొత్తమే! కాని, ఈ సవరణకి మేము వ్యతిరేకులం.

50 కోట్ల డాలర్లు ప్రభుత్వం బోనసుగా యివ్వాలనడంలో ఒకే ఒక్క వాదం వినవస్తోంది. "పాపం - వాళ్లు చాలా కష్టపడ్డారు; అందుకని యిద్దాం." నేనూ వెటరన్సులో ఒకణ్ణే. మేము కష్టపడ్డ మాట నిజమే. కాని, ఆ కష్టపడటం మా ధర్మం నిర్వర్తించేందుకు పడ్డాం. యుద్ధకాలంలో దేశరక్షణకి పాటుపడటం, ప్రతి పౌరునికి ధర్మమై ఉంది. మన రాజ్యాంగ ప్రణాళిక అటువంటి పౌరబాధ్యతని సుస్పష్టంగా నిర్వచించింది ప్రాణాలు పోగొట్టుకున్న యితర సోద రులకంటె, మేము అదృష్టవంతులమని గర్వపడాల్సి వుంది.

పెన్సిల్వేనియా బోనస్ ప్లానును మేము ముఖ్యంగా ప్రతిఘటి స్తున్న దెందుకంటే దానివల్ల ప్రభుత్వానికి అప్పు మూడింతలు పెర గడమే గాక, ఆ అప్పును తీర్చేమార్గం కూడా కనుపించకపోవడం

వల్లనే. అదీగాక ప్రభుత్వం ఖర్చుచేయదలచిన అనేక కార్య క్రమాలలో ఇది ఒకటి. ఇవన్నీ కలిసి ప్రభుత్వం చేసే ఖర్చులో మూడవ వంతును మింగేసాయని తేలింది. కనుక ఇవన్నీ కలిసి అప్పులు మరింతా పెరిగి ప్రజలపై మరింత భారంపడుతుందన్నమాట.

50 కోట్ల డాలర్లు ప్రభుత్వం పంచిపెడుతుందంటే, మహా బావుంటుంది. కాని, ప్రభుత్వ ఖజానాలోకి డబ్బు ఎక్కడ నుంచి వస్తుంది? ఈ నాడు ప్రభుత్వం చేసే అప్పుని, రేపు తీర్చుకోవలసింది ప్రజలు కాదా? మాజీ సైనికుల సంఘానాయకులకి నా మాటలు రుచింపకపోవచ్చు. కాని, పరమసత్యం యింతకంటె వేరే ఏముంది? నిర్మాణపథకాలు ఆచరణలో పెట్టేందుకు ఒకవంక తడుముకొంటూ, 50 కోట్ల డాలర్లు వెటరన్స్‌కి పంచిపెట్టడమంటే, ప్రజలనెత్తిని మరి కొంచెం బరువు మోపడం గాక మరేమిటి?

అందరూ మా అభిప్రాయాలతో ఏకీభవించకపోవచ్చు. మీమీ అభిప్రాయాలు మాకు సంపాదకలేఖలుగా వ్రాయండి - సంతోషంతో ప్రచురిస్తాం. మా దృక్పథం మట్టుకు ఈ బోనసు యివ్వడం అనవసరమని. దేశం మొత్తంమీద ఈ విషయమై తీవ్రవాదోపవాదాలు జరుగుతున్నాయి.

మహాప్రవాహానికి ఎదురీదడ మెందుకని అడుగుతారేమో - కాని ఒకొక్కప్పుడు ఎదురీదక తప్పదు; యిలాటివాటిల్లో తలదూర్చకా తప్పదు. స్వార్థపరులు కొందరు ఆడుతూన్న రాజకీయ జూదమిది. ఆ సంగతి కొందరు విజ్ఞులకి తెలియకపోలేదు. కాని, ఎదురీదిలాభం లేదని, వారు పెదవి మెదపకుండా వూరుకున్నారు. ఈ సవరణ అసమంజసమని మా నిశ్చితాభిప్రాయం. సవరణకి మేము పూర్తిగా వ్యతిరేకులం.

అంచేత, ప్రతిపాఠకుడ్నీ తను వోటు వెయ్యడానికి ముందు, సూక్ష్మ దృష్టితో ఆలోచించమని కోరుతున్నాం.

ఈ సంపాదకీయం ఫలితం ఏమిటంటే, కొందరు చందాదారులు మానుకున్నారు. సవరణని ప్రభుత్వం ఆమోదించింది.

మరొక సందర్భంలో కూడా యిలానే యిరుక్కున్నాం. కాని, అది మా ప్రతిష్టని పెంచింది.

గురువారం ఉదయం మేము ఆఫీసుకివచ్చే వేళకి, మా పత్రికలమ్మే సామ్, "తొమ్మిది కొట్టక పూర్వమే 275 కాపీలు ఖర్చయాయి. ఇంకా కావాలంటున్నారు" అన్నాడు.

మేము ఆశ్చర్యపోయాం – కారణమేమిటో తెలియక.

"నాలుగు వీధుల మధ్య డైనమైట్ పెట్టినంత పని చేశారు," అన్నాడు సామ్.

అప్పటికీ అర్థం కాలేదు మాకు.

"ఎవిక్షన్ కేసు (Eviction Ease). అందులో పెద్దవాళ్లు యిరుక్కున్నారు."

"అందులో ఏమీ లేదే! ఉన్నకథే ఎంతో టూకీగా చెప్పాం. అసలు విషయాలు చెప్పను కూడ లేదే!" అన్నాడు బాబ్.

“ అచ్చులో అక్షరాలు కనిపించే సరికి మనుషులకి ఆరాటం పుడుతుంది, మన ఊళ్లో కూడా ఒక పత్రిక ఉందని క్రమంగా తెలుసు కుంటున్నారు,” అన్నాడు సామ్.

పట్టణాల పత్రికలువేసే ప్రముఖవార్తల్లాటిదే ఆకథ. ‘‘మాజీసైనికునిపై యింటియజమాని ప్రతాపం.’’ నిజానికి, చిన్నపట్నాలలో యింటియజమానులు ప్రతాపం చూపరు. కాని, ఏదో అందంగా ఉండేందుకు ఆమాట వాడాం. అసలు ఈకథని మాకు వెటరన్ వొచ్చిచెప్పాడు. అతను యుద్ధకాలంలో నావికుడు. కార్మిక సంతతికి చెందినవాడు కాబట్టి హక్కులూ నిక్కులూ అతనికి బాగా తెలుసు. ఈ డన్నింగ్ టవున్ కి దగ్గరలోనేవున్న ఉక్కు యంత్రాగారంలో పనిచేస్తున్నాడతను. వెనకొకసారి మాకు సంపాదకలేఖరాశాడు. ఎప్పుడయితే, ఎవిక్షను ఆర్డర్లువచ్చాయో. అప్పుడు తిన్నగా మాఆఫీసుకివచ్చి, తనకి జరుగుతున్న అన్యాయం వర్ణించి చెప్పాడు. చెప్పి, మాసహాయం కోరాడు. కార్మిక వర్గానికి చెందినవాడు కాబట్టి, తన కేసుని తనుస్పష్టంగా చెప్పుకో గలిగాడు.

మేము అతని యింటిదగ్గిరికి వెళ్లేటప్పటికి ఒక మోటారువానూ, అమీనా (Deputy Sheriff), అమీనా

మనుషులూ కనిపించారు. గుమ్మాల పక్కలనుంచునీ గోడల మీాద ఆనుకునీ యిరుగు పొరుగువారు వినోదించూస్తున్నారు. డాక్టరొకతను యింట్లోనుంచి బయటికొచ్చి, ఆ గృహస్తు భార్యకి చాలా జబ్బుగావుందనీ, ఎవిక్షన్ కి యిప్పుడు వీలుకాదనీ అమీానాతో చెప్పాడు. ఈ దిక్కుమాలినపని తనకి తప్పిందిగదా అనుకుంటూ, అమీానా తన మనుషులతో, హాయిగా ఆ మోటారువాన్ లో వెళ్లిపోయాడు. కథపూర్తి అయినట్టే అప్పాటకి.

ఆ యిల్లు ఒక పోలీసు యినస్పెక్టరుది. పోలీసు యినస్పెక్టరు కిందభాగంలో ఉంటున్నాడు. న్యాయపాలన కోసమే పుట్టాడా అని అనిపించే యినస్పెక్ట రతను. ఆయన గారికి, తనయింట్లో మిద్దెమీాద అద్దెకుంటున్న కార్మికనాయకుని వైఖరి ఎంతమాత్రం నచ్చలేదు. ఆ మాటకొస్తే, అతని వాసనే గిట్టడం లేదు. అద్దెవాళ్ళ అమ్మాయి కుళాయి నీళ్ళు వుట్టినే వొదిలిపెడుతోందనీ, అవి కిందికి కూడా బొట్లు బొట్లుగా పడుతున్నాయనీ యినస్పెక్టరు అంటాడు. అంతసంటే గిట్టనివాళ్లు కొందరు, యింతకి రెండింతలు ఎవరో అద్దె యిస్తానన్నారు: అందుకని ఈ కథలు అల్లుతున్నాడని- అంటారు. ఏమయితేనేం. రెంట్ కంట్రోలు వగైరాలమాట అటువుంచి, ఆ పోలీసు యినస్పెక్టరు యితన్ని ఎలాగైనా బయటికి సాగనంపాలని కంకణం కట్టుకున్నాడు.

ఇటువంటి వ్యక్తిగత వైరాల్లో, అసలు సంగతేమిటో, మనకి బుర్ర బద్దలుకొట్టుకున్నా తెలియదు. ఈ యుద్ధాలు నెలలబట్టీ జరుగుతుంటాయి. ఇటు కాసేపు, అటు కాసేపు చెబుతూంటారు పక్కవాళ్లు. కార్మిక నాయకుని భార్య, పోలీసుఇన్స్పెక్టర్ భార్య చెడా మడా తిట్టుకునేవారు. నీళ్ళవద్ద, దీపాల దగ్గిర పేచీలు చెప్పనే అక్ఖర్లేదు. పోలీసు ఇన్స్పెక్టరుకి అతన్ని గెంటించాలని; కార్మిక నాయకునికి, ఆరు నూరయినా సరే, తనహక్కులు నెలబెట్టుకోవాలని - అదీ వైరం. ఇద్దరూ సరి సమాన వృజ్జీలే!

ఈ విషయాలేమీ మేము రాసిన వార్తలో లేవు. అమీనా రావడం, మోటారువాన్, డాక్టరు, అమీనా వెళ్లిపోవడం అంతమట్టుకే రాశాం. మేము ఆ కథని ఎలా ప్రచురించామా అని, పట్నం యావత్తూ ఆశ్చర్యపోయిందట.

"పోలీసు యినస్పెక్టరు అసాధ్యుడు. మిమ్మల్ని యింక వొదిలిపెట్టడు. అతనికి ఎంత పలుకుబడివుందో మీకు తెలియదు కాబోలు. ప్రమాదకరమైన మనిషితో తెచ్చిపెట్టుకున్నారే పేచీ!" అని మమ్మల్ని హెచ్చరించారు కొందరు.

తర్వాత ఒకసారి పోలీసు యినస్పెక్టరుని ఎందుకో కలుసుకున్నాం. అతను చాలా జాగ్రత్తగా చక్కగా మాట్లా

డాడు. మా మీద కోపతాపాలు వున్న ట్లేమీ కనపడలేదు.

ఒకరోజు సాయంత్రం బాబ్ ఆఫీసులో పని చేసు కుంటూ వుండగా, రాజకీయ వాది ఒకతను మా ఆఫీసుకి వచ్చాడు. అప్పుడప్పుడు గాలి కబుర్లు చెప్పేందుకు వచ్చే మనిషి అతను; మాకు కొత్తవాడు కాదు. కాసేపులో కాంభి రామాయణం అయ్యాక అన్నాడు: "మీకు తెలియదా యింకా – మిమ్మల్ని ఉళ్లోనుంచి తరిమేద్దామనుకుంటు న్నారు!"

"ఎవరా అనుకుంటున్నది?" అని అడిగాడు బాబ్.

"ఎవరేమిటి? ప్రజలు. కొన్ని పెద్ద తలకాయలు అనుకుంటున్నాయి మిమ్మల్ని తరిమెయ్యాలని. మీధోరణి సరి అయినది కాదట! మీరు 'రెడ్స్' అని..."

బాబ్ ఫక్కున నవ్వేశాడు. విరగబడి నవ్వుతూ, "అదీ ఒకందుకు మంచిదే! అటువంటి ప్రయత్నం చేయడం వల్ల, మా సర్కులేషన్ రెండింతలవుతుంది. చాలా మంది ఎడిటర్లు ఆ విధంగా బాగు పడ్డారు," అన్నాడు.

రాజకీయవాదికి ఏం మాట్లాడాలో తోచక మాదగ్గర సెలవు పుచ్చుకున్నాడు. మళ్లా కనిపిస్తే వొట్టు.

ఎవిక్షన్‌కి సంబంధించినవార్త ప్రచురించిన వారం రోజులకి ఆరుగురు వెటరన్స్ తమ సంతకాలతో ఉత్తరం

రాశారు. అన్యాయం ఎవరికి జరుగుతోందో వారికి స్పష్టంగా తెలియదు గాని, పోలీసు యినస్పెక్టరుని మట్టుకు నిలవదీశారు. వారి ఉత్తరంలో వందమాటలు మాత్రమే ఉన్నాయి – కాని ఆ వందా రత్నాల్లాంటివి. ఉత్తరం అచ్చు వేసేటప్పటికి, అందులో ఒకతనిఉద్యోగం పోయే టంత పని అయింది; కాని చివరికి పో లేదు. అతను యువజన సంఘానికి నాయకుడు.

ఏమయితేనేం, ఒక ఏడాదిపాటు ఈ ఎవిక్షన్ కేసుతో, ఊరంతా అట్టుడికినట్టు వుడికిపోయింది. ఎవరినోట విందామన్నా ఈకబుర్లే. నిజానికి, పోలీసు యినస్పెక్టరు అంత మరీచెడ్డవాడుకాదు. అతను కొద్దిగా డబ్బున్నవాడు కాబట్టి, కార్మికవర్గం అతనిమీద లేనిపోని నిందలు లేవ దీసింది.

ఇలా జరిగింది, అలాజరిగింది – అని రకరకాల కథలు చెబుతూండేవారు. కాని, మేము ఏమీ రాసేవాళ్లంకాము. ఇతరులు రాసి పంపించినది వారిబాధ్యతతో, పత్రికా ధర్మా నికి విరుద్ధం కానంతవరకూ, అచ్చువేసేవాళ్లం. ప్రజాభి ప్రాయమనే వెలుగు, చీకటి మూలల్ని వెలిగించగలదనే సత్యం తెలుసుకున్నాం.

సంపాదకీయాలద్వారా ఎటువంటి సమస్యలని ఎదు

రోక్కగలమనేది, అంత సులువుగా జవాబు దొరికే ప్రశ్న కాదు. పట్టువిడుపులు వుండాలి. అంతేకాదు, ఏ విషయమైనాసరే కఠినంగా గాక మృదువుగా చెప్పాలి; బల్లగుద్ది చెప్పడంకాదు – మృదువుగా చెప్పడంచేత నవాలి.

# 11

మా పత్రికలోని ప్రతివిషయం, చదువుకునేందుకు చక్కగా వుండాలని, మా దృఢసంకల్పం. ప్రతి చిన్న విషయం మా దృష్టికి, ముఖ్యమైన విషయంగానే కనపడేది. ఎందుకంటే, ప్రజాస్వామ్యమనే మహావృక్షపు వేళ్ళు యిటువంటి చిన్నచిన్నవిషయాలనుంచే జీవం పోసుకుంటాయి. స్థానిక సంస్థలూ, స్థానిక సమస్యలూ, స్థానిక ఆలోచనలూ ఆరోగ్యవంతమైన విస్తృతపథానికి దారితీస్తాయి.

మొదట్లో మేము పెద్దపెద్ద పనులు చేయాలని ఉబలాటపడ్డాం. కాని, కాలక్రమేణాగాని మెట్లు ఎక్కలేమని, తర్వాత తర్వాత తెలుసుకున్నాం. ప్రజాస్వామ్యదేశంలోని స్థానికసమాజంలో వార్తాపత్రికకి ప్రముఖస్థానం ఉంది; కాని, అది సేనాధిపతిలాగానూ, రాజకీయనాయకుడికి మల్లేనూ వ్యవహరించలేదు. ప్రజాజీవితాన్ని చైతన్యస్రవంతివైపుగా మట్టుకు మళ్ళించగలదు.

ప్రతి సోమవారం రాత్రీ బాబ్ పురపాలక సంఘ సమావేశాలకి వెళ్ళేవాడు. పట్నంలోని మంచినీటి సప్లయి గురించి యింజనీరుగారు అంకెలూ అనవాళ్ళూ చెప్పేవాడు; సోలిసిటరుగారేమో దస్తావేజులూ మతలబులూ చెప్పేవాడు. కళ్ళమీదికి నిద్దరకూరుకొస్తున్నా, శ్రద్ధగా వినాలి అలాంటి మీటింగులు. ఆ సమావేశాల్లోది యథాతథంగా ఆర్కియివ్‌లో కనపడాలి. అది పత్రికాధర్మం. ఒక్కొక్కప్పుడు పురపాలకసంఘాధ్యక్షుడు, పత్రికా నిర్వహణ గురించి, బాబ్‌కి, లెక్చరిస్తూండేవాడు. ఆర్కియివ్‌ని పరిజావేది కలా. పట్టణాన్ని బాగుచేసే విషయమై పాఠకులు వ్రాసే అభిప్రాయాలు, ఆయనకు నచ్చేవికావు. అయినా పత్రిక అభిప్రాయాలను అసలు జరపక తప్పేదికాదు. ఇలా కొన్ని పనులు జరిగినా కూడా.

ఆర్కియివ్ పత్రిక క్రిస్మస్ కమిటీ నొకదాన్ని ఏర్పాటుచేసింది. క్రిస్మస్ సందర్భంలో. ఊళ్లో వున్న పిల్లలందరికీ, ఒకవెయ్యి ఆటవస్తువులు పంచిపెట్టడం, బీదా బిక్కీకి తిండీ బట్టాయివ్వడం – ఆ కమిటీచేయవలసిన పనులు.

డాలర్ – డే సేల్ అంటూ, ఒకమూడురోజులపాటు వర్తకులందరూ తమ దగ్గరవున్నవస్తువులని చవక ధరకి అమ్మేందుకు, ఏర్పాటుచేశాం. ఈ కార్యక్రమంలో వర్త

సంఘం మాకు ఎంతగానో సాయపడింది. స్థానిక వర్తకులు ఒకళ్లతో ఒకళ్లు కలవరు. అలాంటి వాళ్లని కూడగట్టుకు వచ్చేందుకు కాళ్లు అరిగేటట్టు తిరిగాను.

ఒకానొక పెట్రోలు బంక్ యడ్వర్టయిజ్‌మెంటు ఎలా పడిందంటే: ప్రతిపావుగాలను ఆయిల్‌కి అయిదు గాలనుల పెట్రోలు ఫ్రీ. అసలు ఆ ప్రకటన – అయిదుగాలనుల పెట్రోలుకి, పావుగాలను ఆయిల్ ఫ్రీ – అని వుండాల్సింది. ఫారమ్ ముప్ఫాతిక ప్రింటు అయ్యాక మాకు ఆ తప్పు కన పడింది. ఇంక అప్పుడు చేయగలిగిందేముంది – ఏమీ లేదు! పత్రిక పూర్తయే వేళకి నా స్థితి ఎలావుందంటే, అయిదుగాలనుల పెట్రోలుకాదు, అయిదు పేట్లెల వజ్రాలు పంచిపెడుతున్నారని చదివినా, ''పోన్లే, తప్పుపడితే పడిందిలే!'' అనుకునేటట్టు వున్నాను.

పత్రిక నాలుగు మూలలకి వెళ్లిందో లేదో, పెట్రోలు బంక్ యజమాని పీటర్సన్ పరిగెత్తుకుంటూ వచ్చాడు మా ఆఫీసుకి. ''వందకారులు వరసని నిలబడి వున్నాయి మా బంక్ దగ్గిర. ట్రాఫిక్ సరిజూసుకోమని పోలీసులకి ఫోను చేసి, యిలా వచ్చాను. మీరు అక్కడికి వచ్చి, ఫలానా పొరబాటు జరిగిందని బోర్డు కడితేగాని, నా మర్యాద దక్కదు.''

ఆర్క్యుయివ్ వేసిన అచ్చుతప్పుకు మన్నించవలసిందని మేము బోర్డు రాయిస్తూండగా, వ్యవసాయ పనిముట్లు అమ్మే జిమ్, ట్రాక్టరులో నుంచి దిగాడు మా ఆఫీసుముందు. “మాచుట్టుపట్లనున్న ట్రాక్టర్లవాళ్లందరికీ చెప్పాను. అందరూ వస్తున్నారు,” అన్నాడు.

పెట్రోలు బంక్ వున్న లంకాస్టర్ ఎవిన్యూలో ఒక వందకారులు వరసగా నిలబడ్డాయి. వాటి వెనక ఒక అరవై డెబ్భయి ట్రాక్టర్లు.

“చాలా పొరపాటు జరిగింది. మీరు ఏమీ అనుకోకూడదు,” అన్నాను పేటర్సన్‌తో ఎంతో బాధావహంగా.

“ఎబ్బే — దానికేం ఫరవాలేదు. మీ పత్రిక ఎంత మంది చదువుతారో యిందువల్ల తెలుస్తోంది,” అన్నాడు పేటర్సన్ మమ్మల్ని అభినందిస్తూ.

# 12

ఆర్క్యుయివ్ పత్రిక మాపట్నానికి ఎంత మేలు చేసిందో, ఎటువంటిమేలు చేసిందో కొలిచిచెప్పడం కష్టం. పదిమందివున్న కుటుంబంలోని తలిదండ్రుల్లాటి వాళ్లంమేము. కుర్రవాడు శ్రద్ధగా చదువుకు, బుద్ధిగావుంటే, తలిదండ్రుల్ని

ఎవరూ శ్లాఘించరు. పురపాలక సంఘం చేస్తున్న మంచి పనులని మెచ్చుకుంటూ, లోటుపాట్లు ఎక్కడవున్నాయో మాటల సందర్భంగా చెబుతున్నపుడు, ప్రజలు మావునికి నే ప్రత్యేకతతో గమనించరు. తల్లి తనపిల్లల విషయంలో తీసుకునే శ్రద్ధనందిన కార్యకలాపం లాటిదే మాపనికూడా. మాతృమూర్తిని ఏ విధంగా ప్రస్తుతించరో, ఆ విధంగానే మమ్మల్నికూడా మెచ్చుకోరు.

అనుభవజ్ఞానం ఎక్కువలేక పోబట్టి, ఈస్థానిక వ్యవహారాల విషయంలో ఒకొక్కప్పుడు యిరుకున పడుతూంటే వాళ్లం. మానదభిప్రాయాలు ఎందుకూ కొరగాని వయేవి. సత్కార్యాలు చేదామనుకుని, పిచ్చిపనులు చేయడం, మానవ స్వభావంలోనే ఉందేమో! మేమూ పొరపాటులు చేసేవాళ్లం. నిజమనుకుని మేము వ్రాసిన వార్తల్ని, మామీద దుష్టప్రచారానికి ఉపయోగిస్తూండే వారు కొందరు.

సందర్భవశాన కలుసుకొని, ఈ మాటా ఆ మాటా మాట్లాడుతున్నప్పుడు కొందరి కోపాలు పోయేవి. కంట్రీ ఎడిటర్ కి అన్నీ తెలిసివుంటాయి. కాని, తెలిసినవన్నీ పేపరుమీద పెట్టకూడదు.

ఇతరులు మమ్మల్ని కొప్పడితే కొప్పడుగాక! కాని,

వాళ్ళని మళ్ళీ కోప్పడాలని అనిపించేదికాదు. కోపంలో వృధాచేసుకునేటంత టైమేదీ మాకు? ఇటుమనుషు లేమంటున్నారో, అటుమనుషు లేమంటున్నారో తెలుసు కోడం, ప్రజాజీవనం ఏ ప్రవాహంగతిని అనుసరిస్తోందో గ్రహించడం, మా సంపాదకీయ దృక్పథం ఎలా ఉండాలో నిర్ణయించుకోడం – యిదే మా పని!

మేము ఎవరికీ చెందక, నిష్పాక్షికంగా ఉండటం, ప్రజలని ఆశ్చర్య చకితులుగా చేస్తూండేది. మేము యిటో అటో తెలుసుకోవాలని వారికి వుండేది. మేము ఎటూ కాదు. వెనుకటి ఎవిక్షన్ కక్షలో, పోలీసు యినస్పెక్టరు ప్రజల దృష్టిలో, చెడ్డవాడుగా కనపడ్డాడు. ఆ యినస్పెక్టరే కొన్నాళ్ళయాక, తన విద్యుక్తధర్మాన్ని విజయవంతంగా నిర్వహించినందుకు, ఘనంగా పేర్కొన్నాం.

డవునింగ్‌టవున్‌లో మూడు చిన్న బైండింగ్‌షాపులు వున్నాయి. ఆ మూడూ జూదశాలలని ఊళ్ళో వాళ్ళందరికీ తెలుసు. పోలీసు వారికీ తెలుసు. కాని, ఆ జూదపుకొట్లు నిర్వహించే ధనవంతుడికి భయపడి, ఎవరూ కల్పించుకునేందుకు ధయిర్యం చెయ్యలేదు.

హామిల్టన్ అను ఒక సంఘసంస్కారి చెవినిపడింది– ఆ జూదపు కొట్లలోకి హైస్కూలు పిల్లలు కూడా వెళ్తున్నా

రని. పురపాలక విషయాలు, ప్రభుత్వ విషయాలు, సమాజ విషయాలు – యిలాంటివాటికోసం తన పత్రిక సమయం విని యోగించేవాడు ఆ హామిల్టన్. స్థానికాధికారులూ, పోలీసులూ ఆ జూదపుకొట్లు మూసేయించడానికి అశక్తులని తెలుసుకొని పై అధికారుల దగ్గిరికి వెళ్ళాడు హామిల్టన్. స్టేట్ సిబ్బంది సాయంతో, వెనుకటి పోలీసు యినస్పెక్టరు అధ్వర్యాన దాడి జరిగింది. పోలీసు యినస్పెక్టరు చాలా గుట్టుగా ప్రవర్తించి, పైవారి మన్ననలకి పాత్రుడయాడు.

బాబ్ ఈ కథని పుట్టుపూర్వోత్తరాలతో అచ్చు వేయగానే, పోలీసు యినస్పెక్టరు మొహం వికసించింది. స్వయంగావచ్చి, మమ్మల్ని అభినందించి వెళ్ళాడు. ఇన్నాళ్ళూ మమ్మల్ని "రెడ్స్" కింద జమకట్టిన కొందరు ఆ మరభిప్రాయం మార్చుకున్నారు. ఏమయితేనేం, కొందరు మమ్మల్ని మంచివాళ్ళు అంటూంటే, మరికొందరు మమ్మల్ని చెడ్డవాళ్లు అనేవారు. అది మాకు అలవాటై పోయింది.

వ్యక్తిగత విద్వేషాలకి సంబంధించిన వార్తలు పట్టు కొచ్చి, అవి మమ్మల్ని వెయ్యమనేవారు. మా కొలబద్ద ఒక్కటే :—సాంఘిక ప్రయోజనంలేని సమస్తం, చిత్తు బుట్టకే అంకితం.

రకరకాల స్వభావాలూ, రకరకాల సమస్యలూ

తెలుసుకోవడం మనసుకి ఉత్తేజాన్ని యిస్తుంది. అంతర దృష్టితో మనోవైశాల్యం పెరుగుతుంది. మనోవైశాల్యం పెరిగినకొద్దీ ఈ లోకంలో ఏ ఒక్కటీ చీకాకనుపించదు. అప్పుడే మనం నిజంగా జీవిస్తాం. ప్రతిదీ ఉత్సాహంతో తొణికిసలాడుతుంది. మన కోర్కెలూ మన ఆశలూ ఒక్కొక్కప్పుడు, మనం అనుకోనివిధంగా, ఆశ్చర్యకరమైన ఫలితాలనిస్తాయి. ఒకపట్నంలోని ప్రజాజీవితానికి సంబంధించిన సమస్యలని పరిశీలించడమంటే, పైపై విషయాలతో ఆగం - 'అసలు విషయాలు' - దగ్గిరకెళ్లి వాటిని తరిచిచూస్తాం. ఆ 'అసలు విషయాలే' మానవ స్వభావాన్ని నడిపించేది!

# 13

1947 ఫిబ్రవరిలో ఒకరోజు వుదయం పెద్ద అగ్నిప్రమాదం జరిగింది. ఊరికి రెండుమైళ్లదూరంలో వున్న నీగ్రోస్కూలు తగలబడిపోయింది. డవునింగ్‌టవున్ యిండస్ట్రియల్ అండ్ యగ్రికల్చరల్ స్కూలు అనబడే ఈనీగ్రో పాఠశాలని, 1905 లో కొందరు సంఘసేవాతత్పరులు, నీగ్రో పిల్లలకోసమని స్థాపించారు. నేరాలూ, రంగుజాతుల కలహాలూ, ఆర్థికబాధలూ - వీటికి దూరంగా వుంటూ నీగ్రో యువకులు విద్యాబుద్ధులు నేర్చుకునేందుకుగాను ఈ స్కూలు ప్రారంభింపబడింది.

ప్రిన్సిపాల్ జేమ్స్ వేరింగ్, ఆయన భార్యా ఈస్కూలు కోసం ఎన్నో సంవత్సరాలబట్టి కృషిచేస్తున్నారు. పిల్లల హాస్టలూ, స్కూలు భవనమూ, టీచర్ల వస్తువులూ, పిల్లల వస్తువులూ అన్నీ మంటలకి ఆహుతి అయిపోయాయి. ప్రిన్సిపాల్ దంపతులు యిన్నేళ్ళబట్టీ చేస్తున్నకృషి, ఆ ఉదయంతో, బూడిద పాలయింది. ఇంక స్కూలు కట్టెయ్యడం మినహా మార్గాంతరం లేదనిపించింది.

అప్పుడు దైవికంగా ఒకసంఘటన జరిగింది. మానవులు స్వతహాగా మంచివాళ్ళే అన్న సమ్మకాన్ని దృఢతరం చేసేందుకా అన్నట్టు, దయాసముద్రులైన ప్రజలు ధారా వాహికంగా సహాయం చేయడం మొదలెట్టారు. ఆస్కూలుకి, ఆనాటి అగ్నిప్రమాదం, ఈ ఏభై యేళ్ళ బట్టీవున్న రంగు విధాలని, యిట్టేపోగొట్టింది. బట్టలేమిటి, భోజన పదార్థాలేమిటి పుస్తకాలేమిటి – కుప్పతిప్పలుగావచ్చి పడ్డాయి. నీగ్రో పిల్లలు తమ గడపదొక్కడానికి వీల్లేదన్నవాళ్లు, "అయ్యో, పాపం" అనుకుంటూ వారిని తమదగ్గిర కొన్నాళ్లపాటు అట్టే బెట్టుకునేందుకు, తమంతట తామే ముందుకి వచ్చారు. ఎన్ని సంవత్సరాలబట్టో ప్రిన్సిపాల్ దంపతులు సాధించలేక పోయిన కార్యాన్ని, ఈ విపత్తు అరగంటలో చేసిపెట్టింది. స్కూలుకి సహాయం చేసేందుకు వెంటనే ఒక కమిటీ ఏర్పాటయింది. బిల్డింగ్ ఫండు పోగుచేయవలసిన ఆవశ్యకత

గురించి ఆర్క్టాయిమ్‌లోనూ, సాటర్‌డే ఈవినింగు పోస్టు లోనూ వ్యాసాలు వచ్చాయి. ఆ కమిటీ, ఈ వ్యాసాలూ సాధించిన దేమిటంటూరా? ఆ స్కూలు చరిత్రలో కనివిని యెరగనంతటి సొమ్ముని – ఒక లక్ష యాభై వేల డాలర్లని, ప్రభుత్వం, స్కూలుభవన పునర్నిర్మాణానికిగాను గ్రాంటుగా ఇచ్చింది.

పత్రికకి ఎప్పుడూ ప్రజాబలం వెనకనుండాలి. మేము ప్రచురించేవార్తల్లో నూటికి తొంభయి తొమ్మిదివంతుల్ని సర్వసామాన్యమైనవే; నిత్యకృత్యంలో జరిగేవే! కాని, ఆ సర్వసామాన్యవిషయాలచుట్టూ ప్రజాజీవితం పరుగులెడు తూంటుంది. ఆ సామాన్యవిషయాల కేంద్రస్థానమే ప్రజ. మాకు కావలసింది ఆ ప్రజా, ఆ ప్రజాబలమూ. అదిమర్చి పోయి మేము నిరుత్సాహపడితే, మా పత్రికా ధర్మాన్ని సరిగ్గా నిర్వర్తించలేక పోయామన్నమాటేగా!

# 14

పత్రికను గురించి మేము కనినకలలలో, మా త్రివర్ణ స్వప్నంలో, యెకవుంట్ పుస్తకాలు, బిల్లుపుస్తకాలు, జమా ఖర్చుల పట్టీ మొదలైనవిలేవు.

1947 జూన్‌లో విశ్రాంతికోసమని బాబ్ దూర ప్రదేశానికి వెళ్లినప్పుడు, చక్కని సూటులోవున్న పొడుగాటి

యువకుడు తిన్నగా ఆఫీసులోకివచ్చి, తను ఆడిట్ కోసం వచ్చానన్నాడు. అదేమిటో నాకు అర్థంగాకపోయినా, తెలియనట్టు కనిపిస్తే బావుండదని - "అలాగా" అన్నాను. తెలివి తక్కువతనం బయట పడనియ్యవచ్చా?

కాని లాభంలేకపోయింది. చిట్టచివరికి వొప్పుకోక తప్పిందికాదు. 'ఆడిట్' విషయం నాకేమీ తెలియదనీ, బాబ్ వచ్చాక అతన్ని అడగాలి గాని నన్నడిగి ప్రయోజనం లేదనీ అన్నాను.

"మీ భర్తగారు ఎబిసి సభ్యత్వానికిగాను దరఖాస్తు పంపించారు. మీకేమంత సర్క్యులేషన్ వున్నట్టు తోచదు - దరఖాస్తు ఎందుకు పంపించారో గాని!" అన్నాడు ఆయువకుడు, ఎలక్ట్రిక్ దీపం నుంచి కప్పుదాకా వున్న సాలిగూళ్ళ వంక ఒక్కసారిచూస్తూ,

"నిజం చెప్పొద్దూ - ఎబిసి పేరు నేను ఇంతదాకా వినలేదు. అదేదో యడ్వర్ట్ యిజ్ మెంటులు యిచ్చేసంస్థ అనుకుంటాను. యడ్వర్ట్ యిజ్ మెంటులు యిచ్చేందుకైతే, నామాట నమ్మవచ్చు. మాపత్రికకి వున్నంత ప్రచారం ఈ చుట్టుపట్ల ఏపత్రికకీ లేదు," అన్నాను.

ఆ యువకుడు తలపంకించి, కళ్ళుతిప్పి, ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు.

అతను తిన్నగా న్యూయార్కు నుంచి వచ్చాడట ఈ పనికోసమనే, యింత ఎండకాలంలో, అంత దూరం నుంచి వచ్చాడట. "మళ్లీ మరొకసారి రావడం ఎక్కడ కుదురుతుంది?" - అన్నాడు. ఎబిసివారు ఏ పత్రిక ఎన్ని కాపీలు అమ్ముతుందో, నిజమైన లెఖ్కలు చూసి, సర్టిఫికేటు యిస్తారు. ఆ సర్టిఫికేటు పత్రికపాలిట శ్రీరామరక్ష.

"మీ సర్క్యులేషన్ కార్డులు చూడనివ్వండి." అన్నాడతను.

చందాదారుల కార్డులు నాలుగైదు అతని చేతికిచ్చి - మా భార్యా భర్తల మిద్దరం రాత్రింబవళ్లూ కష్టపడుతూ, ఈ పత్రికని నిలబెడుతున్నాం - అన్నాను. కష్టం ఎక్కువై, ఆరోగ్యం చెడటంవల్ల, విశ్రాంతి తీసుకునేందుకు బాబ్ వెళ్లాడని కూడా చెప్పాను.

చందా దారుల కార్డులవంక చూసి, అతను విచారంగా మూలిగాడు. సంపాదకీయం తొందరగా పూర్తి చేయాలనే ఆందోళనలో నేను వున్నాను.

"ఇటు చూడండి," అన్నాడు ఆ ఆడిటర్.

కార్డువంక చూశాను. కార్డుకి ఎడమ తలకట్టు వైపున పేరూ, యడ్రసూ, తేదీ ఉన్నాయి. తేదీ అంటే

ఏనాటికో చందా అయిపోతుందో ఆ తేదీ. అందులో పొరబాటు ఏమీ నాకు కనపడలేదు.

"కార్డుమీద ఆ పెన్సల్ మార్కు లేమిటి?" అన్నాడు.

ప్రతి కార్డుమీద పెన్సిలుతో రాసినమాట నిజమే. మాకు ఆ పెన్సల్ అక్షరాలు స్పష్టంగా అర్థమవుతున్నాయి. కాని మా ఆడిటర్‌కవి తెల్లా జెర్రులూలా వున్నాయి.

"ఆయన యిచ్చేశాడు."

"బాబ్‌కి బాంక్ మూల యిచ్చానన్నాడు."

"తర్వాత పంపుతానన్నాడు;"

"హైస్కూలుకి యిస్తానన్నాడు."

"జేన్‌కి స్టోర్ దగ్గిర యిచ్చానన్నాడు."

"జీతం రోజున యిస్తాడట."

"రెండు సార్లు అందింది."

ఆ ప్రకారం రాసివున్నాయి పెన్సలుతో.

"ఈ రహస్య భావాల అర్థం మీకు తెలియాలి గాని నాకు తెలియదు. అదీగాక, అలాటివి తెలుసుకోవడం నా పని కాదు. ఎబిసి మనిషికి కావలసిందేమిటంటే, – ఈ చందాలు ఎప్పుడు అందాయి? – అవి అందినట్టు రుజువు చేసేందుకు బాంకు చలానా ఎక్కడ? లేనిపక్షంలో, వాటిని

నిజమైన చందాలుగా ఆమోగించలేం,'' అన్నాడా ఆడిట్ మనిషి.

ప్రతివారం పేపరు బయటపడేందుకే సతమతమవుతున్నామనీ, ఆ కారణంగా మేము అకవుంట్లు సరిగా వుంచలేకపోయామనీ, మేము వీధిలోకి వెళ్లినప్పుడు ''ఇదిగో, పోయినవారం ప్రకటనతాలుకుపైకం'' అనీ, ''ఇదిగో, నేను బాకీపడ్డ చందాపైకం'' అనీఅంటూ మనుషులు మాకుడబ్బుయిస్తూ వుంటారనీ, ఆ పైకం జేబులో పడేసుకు, ఆఫీసుకొచ్చేదాకా మాత్రం అది ఎవరిచ్చారో జ్ఞాపకం వుంచుకునేవాళ్ళమనీ, అతన్ని సావధానబరుస్తూ చెప్పాను.

నే నింకా చెబుతూండగానే, ''చందా పుచ్చుకునే స్థలం యిదేనా!'' అని బిగ్గరగా అరుస్తూ, ఒక ఆడమనిషి లోపలికి వచ్చింది.

ఇదేనని ఆమెకి నచ్చజెప్పి, ఆమె యిచ్చిన పైకం పుచ్చుకున్నాను. ఎబిసి మనిషివంక చూస్తూ, ''దీనిని ఏమి చేయాలో, దయచేసి, చెబుదురూ?'' అన్నాను ప్రాధేయపూర్వకంగా.

నుదుటిమీద స్వేదబిందువులు తుడుచుకుంటూ, మధ్య మధ్య గుక్కెడు మంచినీళ్ళు తాగుతూ, ఎబిసి మనిషి ఆ పూట మా అకవుంట్ పుస్తకాలు వరుసగా పరీక్షించాడు.

అకవుంట్ అనేది సులువుగా ఎలా రాయాలో విడమరిచి చెబుతూ, పాత అకవుంట్లు క్రమపద్ధతిలోకి తీసుకువచ్చేవిధానం కూడా చెప్పాడు. అకవుంట్లు విషయంలో అతను మాకు చేసిన సాయం యింతా అంతా కాదు.

ఆ తర్వాత అతను, ఎన్నోసార్లు మా ఆఫీసుకివచ్చి, లెక్కలు పరిశీలించాడు. ఒక ఏడాది గడిచాక మేమూ ఎబిసి మెంబర్లమయ్యాం. ఆర్కుయివ్ ఎబిసిమెంబరయిందని విన్ననాడు, మేము ఎంత సంతోషపడ్డామో చెప్పలేను. ఎబిసి సభ్యత్వమే గౌరవచిహ్నం.

బాబ్ విశ్రాంతినుంచి తిరిగిరాగానే మొట్టమొదట చేసినపని యేమిటంటే, మా అకవుంట్ పుస్తకాలు రాసేందుకు పీటర్స్‌ని కుదర్చడం. నేను ఎప్పుడూ ఆ మాట మొహం మీాద చెప్పలేదుగాని, ఆ ఫెల్ట్‌హాట్‌తో అతను సెయింట్ పీటరులా కనిపించేవాడు నా కళ్లకి.

ఏభై యేళ్ళు రైల్వేలో పనిచేసి రిటైరయాక, గోళ్లు గిల్లుకుంటూ యింట్లో కూచోడం అతనికి బావుండేదికాదు. "పార్టు-టైము" అని పెట్టుకున్నాం; కాని, మొదటివారం గడిచాక, అతను మాకంటె ముందువచ్చి, సాయంత్రం అయిదుకొట్టాక వెళ్తూండేవాడు.

పీటర్స్‌రాకతో మా ఆఫీసులో నెమ్మది నెమ్మదిగా

మార్పులు కలగ నారంభించాయి. ఒకరోజు మా టేబుల్ వంక చూసి అతను అన్నాడు : "నేను రయిల్వేలో పనిచేసి నన్నాళ్ళూ, ఏ ఒక్కరోజూ టేబుల్ మీద కాయితాలు వుంచి వెళ్ళేవాణ్ని కాదు; ఎక్కడి వక్కడసర్దేసి వెళ్ళే వాణ్ణి."

ఆపాఠం నాకూ బాబ్ కూను. పీటర్స్ వొచ్చాక డబ్బు గొడవలు ఆలోచించడం మానేశాం.

# 15

1948 వసంతకాలానికి మేము హానీబ్రూక్ వొదిలి వేయవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. పత్రికని బయట పడె య్యడం, ఏ వారానికావారం, కష్టతరమవుతోంది. ఆర్క యివ్ సర్కులేషన్ కూడా మునుపటికంటె బాగా పెరి గిందాయె.

ఆ వేసవికాలమంతా, మాకు పనికొచ్చే యింటి కోసం చూశాడు బాబ్. పత్రికలో ఒక చిన్న ప్రకటన కూడా వేశాం: "ఆర్కయివ్ పత్రికకి కావలసిన ప్రెస్ పెట్టుకునేందుకు, ఎవరైనా తగుస్థలం చూపించి, సహాయం చేయ ప్రార్థన"

సలహాలకేం కావలసినన్ని వచ్చాయి. ఒక రైతు

తన వాములదొడ్డి యిస్తానన్నాడు. మరొకతను మా ఆఫీసు కొచ్చి – మహామంచి స్థలంవుంది – అన్నాడు.

"ఏటవతల ఛేప్పైన నేల ఉంది. చెట్లు కొట్టించేసి, మీ యిష్టమొచ్చిన పద్ధతిలో యిల్లు కట్టించుకోవచ్చు," అన్నాడతను.

"బాగానే వుంది. చందాదారులు అక్కడికి రావడమెలా? పడవెక్కి ఏరుదాటాలి కదూ!" అన్నాడు బాబ్ నవ్వుతూ.

ఏమయితేనేం, ఆగస్టునాటికి మాకు, వెనకగుర్రాలశాలగానూ, యిప్పుడు పాతకార్లు పడేసుకునేందుకూ ఉపయోగబడుతున్న ఒకషెడ్డు, దీర్ఘకాలం అద్దెకి (Long-term Lease) దొరికింది. అది మెయిన్ రోడ్డుకి దగ్గర్లోనే వుంది కూడా.

మా ప్రెస్ మేము పెట్టుకోవడమనగానే, కొత్తసమస్యలు అంకురార్పణ అయాయి. ఆ గుర్రాలశాలని మా మిషన్లూ అవీ పెట్టుకుందుకు వీలుగా మార్చాలి. ఏ వారానికి ఆ వారం పత్రిక తీసుకొస్తూ, ఇటు అశ్వశాలని యంత్రాగారంగామార్చే నిర్మాణ కృషిని నిర్విఘ్నంగా కొనసాగిస్తూండాలి.

రసెల్ మా దగ్గిర మేనేజరుగా చేరేడు. బాబ్,

రసెల్ యిద్దరూ పాతప్రెస్సు, లెక్కడయినా చవకగా దొరుకుతాయేమోనని వేట ప్రారంభించారు. గాలీలు, ప్టోన్సూ, టైప్ స్టిక్సూ, లెటర్ ప్రెస్, ఆఫ్ సెట్ - యిలాటి విషయాల గురించీ వాటి ధరవరల గురించీ అస్తమానం మాట్లాడుకుంటూండేవారు.

ఇలా వుండగా, ఒక శనివారంనాడు లారీమీద దిగింది నలభై ఏళ్ల వయసుగల లినోటైపు మిషను, దాని సామానులతోటి. డవునింగ్ టవున్ కి పంద మైళ్ళదూరంలో ఒక పశువులశాలలో పడివుండట ఈ మిషను.

బాబ్ బంధువుల్లో ఒకతను, నలభై అయిదేళ్ళ వయసుగల 'మియెవె' అచ్చుయంత్రమూ, 22 పెట్టెల టైపులూ పదిహేనువందల డాలర్లకి అమ్మడానికి అంగీకరించాడు. చవక బేరమేగాని, టైపులన్నీ వేటికవి సర్దుకునేందుకు, మూడు నెలలపాటు పట్టింది. టైపులు బయటికి తియ్యడం, వాటికి పట్టుకున్న దుమ్మూదుట్రా దులిపితుడవడం ఆపైన వాటిని ఆయా కేసులలో పోయడం - యిదీ చేయవలసింది. మా అబ్బాయీ, అమ్మాయీ మాత్రమే గాకుండా రసెల్ కొడుకూ (8 వళ్ళు) రసెల్ కూతురూ (5 ఏళ్ళు) కూడా ఈ పనిలో ప్రవేశించారు. మా అమ్మాయేమో బ్లాకులతో మేడలు కడుతూ కూచునేది. మిగతా ముగ్గురికీ పెద్ద అక్షరాలు యిచ్చి, వేటికవి విడిగా ఏరమనే

వాళ్లం. కాని, ఏం ప్రయోజనం? ముగ్గురు పిల్లలూ నైపు లేరడం మర్చిపోయి, "నన్ను ముట్టుకోకోయ్" ఆట ఆడుకునేవారు. మా యింటి యజమాని విద్యుత్పరికరాల వ్యాపారి. అంచేత, మాకో అయిస్ బాక్సూ, రేడియో యిచ్చాడు. ఆర్క్ యివ్ అచ్చుయంత్రం ఎంత దాకా వచ్చిందని, దారినిపోతూ మమ్మల్ని పలకరించేవాళ్లకి రేడియో సంగీతమూ, చల్లటి పానీయమూ ఉచితంగా లభించేవి.

తెల్లారితే పత్రిక వస్తుందనగా, అంతకి క్రితం రాత్రి పడ్డ అవస్థ వర్ణనాతీతం. ఆఖరి పేజీలలోని యడ్వర్టయిజ్మెంటు హెడ్డింగులకి కళ్లలో నైపులేదు. డ్రాయర్లు తెరిచి అక్షరాలు వెతక నారంభించాము. లోయర్ కేసు "a" (చిన్న అక్షరం) అని ఒకరూ, పద్ధెనిమిది పాయింట్ల డివిన్ని "p" కావాలని ఒకరూ - అంతా గందరగోళమే కదా ఆరోజున! 24 పాయింట్ల "q" అడుగు భాగాన్ని ఛేదించి "a" గా చేశాం - ఒక యడ్వర్టయిజ్ మెంటులో.

మా ప్రెస్‌లో అచ్చయిన పత్రికని చూసుకుంటే మాకే సిగ్గేసింది. ఒక వ్యాసం మొదటి నుంచి చివరివరకు అర్థ రహితంగా ఉంది. ఎందుకంటే "p" లు వుండవలసిన స్థానంలో "m" లు వున్నాయి. ఆ కోతిపను మా 'లినో టైపు' చేసింది.

రాత్రి ప్రింటింగ్ మొదలు పెడతామనగా, ఆ సాయంత్రంవేళ స్నేహితులూ యడ్వర్టయిజర్లూ వొచ్చి మాకు శుభాకాంక్షలు అందజేసి వెళ్లారు. బైండింగ్ వేళకి ఉత్తమ గుణశీలురైన బాబ్ మేనత్తలిద్దరూ అందుకున్నారు. ఆరోజు మడతపని అందరం కలిసి మేఘాలమీద పూర్తి చేశాం. సరిగ్గా అయిదూ నలభై అయిదుకి (ఉదయం) పత్రిక కట్టలు కారులో పడేసుకు, పోస్టాఫీసుకి వురుకు లెత్తాం.

ఆరుకి యింకొక్క నిముషం ఉందనగా పోస్టాఫీసు చేరుకు, "హమ్మయ్య!" అనుకున్నాం. ఎంత అలిసి పోయివున్నామో చెప్పలేను.

మొఖానికి వున్న సిరామరకలు కూడా తుడుచుకోకుండా, ఆ బట్టలతోటే పక్క మీదపడి, వొళ్లు తెలియకుండా నిద్దరపోయాడు బాబ్.

నాకు అలా ఎలా కుదురుతుంది? శుభ్రంగా స్నానం చేసాక, అబ్బాయిని బడికి తీసుకు వెళ్లాను. ఆ రోజున వాళ్ల స్కూలులో ఏదో ప్రదర్శన ఉంది. ప్రదర్శన అయేదాకా ఆదర్శమాతలా కూచున్నాను – కళ్లమీదకి కూరుకొచ్చే నిద్రపైకి కనపడనీయకుండా. కంటినిండా నిద్రకి నోచుకోని ఈ దాంపత్యం భేషుగ్గావుందే! – అనుకున్నాను. శిరమ

నించి పాదాలదాకా ఒక టే అలసట. కాని, అది నేను సంతోషంతో స్వీకరించిన అలసట.

నెమ్మది నెమ్మదిగా ఎక్కువ్రైవులు కేసులలో పోశాం. ప్రెస్‌కి దగ్గిరగానే మేము వుండటంవల్ల ప్రతివారం 200 మైళ్ళ తిరగవలసిన తిప్పట మాకుతప్పింది. మావెండెల్ (మోటారుకారు) కి అప్పుడే తొమ్మిదోఏడు వచ్చింది. అర్థ రాత్రివేళ నేనూ, బాబ్ మాప్రెస్ చుట్టూతా తిరుగు తూండేవాళ్లం. "యివి నిజంగా మావేనా?" అన్నట్లు. ఆ వైవుకేసులూ ఆమిషన్లూ ముట్టుకు చూసేవాళ్లం. "మీవే సుమండి!" అని ఏనెలకానెల బాంకువాళ్లు జ్ఞాపకం చేస్తూండే వారు. రసెల్ కొన్ని యితరమైన ప్రింటింగు పనులు తీసుకు రావడంతో, మేముకాస్త తేరుకోగలిగాం.

మాకంపెనీ పేరు ఛెస్టర్ వాలీప్రెస్. బాబ్ ప్రెసి డెంటు, నేను వైస్‌ప్రెసిడెంటుని; రసెలేమో కోశాధికారీ, సెక్రటరీ. రోజులు గడిచిన కొద్దీ మాసమస్యలు పెరగడం మొదలెట్టాయి. ఆ సమస్యలు ఎంతకీ యంత్రాలకి సంబం ధించినవే. హానీబ్రూక్‌లో వున్నన్నాళ్లూ మాకీ యంత్రాల బెడద లేదు. ఒకొక్కనాడు ఆఖరు క్షణాన అచ్చుయంత్రం మొండికేసేది; లేకపోతే లినోవైపు చెప్పినమాట వినేది కాదు.

బాబ్, నేనూ యంత్రాలుకూడా మనుష్యుల్లాంటివే - అను నమ్మకానికివచ్చాం. ఒకొక్క రోజున మారాం మొదలెట్టేవవి; కొన్నిగంటలసేపు మంచిమాటలచెప్పి బతిమాలుకుంటే, దారిన పడేవి.

# 16

పత్రికని భాగావృద్ధిలోకి తీసుకురావాలని మేము చేసిన ప్రథమప్రయత్నం, మమ్మల్ని దివాలా తేయించేటంత దగ్గరకి పట్టుకొచ్చింది.

హంఫీ బారన్స్ అను తోటి సంపాదకుడొకతన్ని కలుసుకొచ్చి, బాబ్ అన్నాడు: "మనకి కొత్తమిషను వస్తుంది"

"ఎక్కడనుంచి? విమానంలోనుంచి దిగుతోందా?" అని అడిగాడు మేనేజరు రసెల్.

"మనకి కావలసింది డబ్బు. బార్‌న్స్‌యిట్టే నాలుగు వేల డాలర్లు సంపాయించాడు. మనమూ ఆపని చేస్తేసరి!" అన్నాడు బాబ్.

తనపత్రిక "డిలావేర్ వీక్లీ" సర్క్యులేషన్ పెరిగేందుకు బారన్స్ నడిపిన పోటీ విజయవంతంగా పరిణమించింది.

ఎవరు ఎక్కువ చందాలు పోగుచేస్తే, వారికి మొదటి బహుమానం మూడువేల డాలర్లు ఖరీదుచేసే బ్యూక్ కార్ ; రెండవ బహుమానం 750 డాలర్లు రొఖ్ఖం - యిలా యింకా చాలాప్రయిజులు వున్నాయి. రెండువేలమంది కొత్త చందాదారులు వచ్చారు; ఒక వెయ్యిమంది చందాలు 'రిన్యూ' చేశారు. ఏమయితేనేం, ఖర్చులుపోను నాలుగు వేలు నికరంగా మిగిలింది బారన్స్‌కి. మాప్రార్థనలకి సమాధానమా అన్నట్టు కనిపించింది ఈ మార్గం. ఒకవేళ మేము అనుకున్నంత రాకపోతే, నాపని దివాలేగా!

ఒకవారం రోజులపాటు మథనపడి, ఈపోటీ విషయమై మరొక కంపెనీతో వొప్పందం చేసుకు, సంతకం పెట్టి వొచ్చాడు బాబ్. ఆ సంగతి నాకు చాలారోజుల దాకా తెలియలేదు. తెలిశాక మహావ్యాకుల పడ్డాను.

నవంబరు మొదటి వారంలో చందాలపోటీ గురించిన ప్రకటన పత్రిక మొదటి పేజీలో పెద్దక్షరాలతోపడింది. బాబ్ ఆ ప్రకటనని బెదురుతూ చూశాడు.

చందాలు రావడం, పోటీదారులు రావడం బహు నెమ్మదిగా జరిగింది. కొన్నాళ్ళ యేటప్పటికి మా ఆశలన్నీ కూలిపోయాయి. బ్యూక్ కారు అప్పోసొప్పోచేసి కొని యివ్వకతప్పదు ; అందుకు దక్షిణగా 750 డాలర్లు రొఖ్ఖం కూడాను.

మేము ఆఖరుక్షణాన ఏదో గమ్మత్తుచేస్తామనీ కారు యివ్వడం అబద్ధమనీ ఊళ్లో పుకారు బయలుదేరింది.

ఒక శనివారం నాడు బాబ్ పోటీదారు లందరినీ మా ఆఫీసుకి పిలిపించి, యిలా చెప్పాడు: "ఈ పోటీ ద్వారా వచ్చే చందాల పైకమంతా ప్రయిజుల కోసమనే వినియోగింప బడుతుంది. నాకేమీ అక్కర్లేదు. నన్ను యిరుకున పెట్టనూ వద్దు, మీరు యిరుకున పడనూ వద్దు. నాకువున్న సమస్తం అమ్మేసి అయినాసరే, మొట్టమొదట ప్రచురించిన ప్రకారం ప్రయిజులు యిచ్చి తీరుతాను."

కొత్త సంవత్సరాది నాటికి ఆ పీడకల నుంచి విముక్తులమయాం. మొదటి బహుమతి బ్యూక్ కారు పుచ్చుకున్నతని ఫోటో, రెండవ బహుమతి 750 డాలర్ల చెక్కు పుచ్చుకున్న తని ఫోటో – రెండు ఫోటోలూ వారు ఆయా బహుమతులు స్వీకరిస్తూండగా తీసి, పత్రికలో అచ్చువేశాం. అంతా అయాక బాబ్ లెక్కలు చూశాడు. మాకు మిగిలింది 32 డాలర్ల 50 సెంట్లు. కొత్త సంవత్సరాది నాటికి ఆ మాత్రం మిగిలింది, ఫరవాలేదు – అనుకున్నాం.

ఆర్థికంగా మేము వెనక ఎలావున్నామో, యిప్పుడూ అంతే. అదనంగా వచ్చిందేమిటంటే, బాబ్‌కి ఈ మనస్తాపం వల్ల రెండు కురుపులు లేచాయి. కాస్త ఊపిరి పీల్చు

కున్నాక, ఈ చందాల పోటీ మాకుమేలు చేసిందని తెలుసుకోగలిగాం, ఎలాగంటే, పత్రికని ఆర్థికంగా కాకపోయినా, యితరత్రా వృద్ధిలోకి తీసుకొచ్చింది.

పోటీలో పాల్గొన్న యిరవైమంది పోటీదారులూ గౌరవనీయమైన కుటుంబాలకి చెందినవారు. ఆరువారాల పాటు వారు రాత్రింబవళ్లు ఆర్కాయివ్ ప్రచారంకోసంపాటు పడ్డారు. ఎనిమిదివందల యిరవైమంది కొత్తచందాదారులని చేరిపించారు; మూడువందలమంది చందాలు 'రిన్యూ' చేయించారు. కాని బారన్స్ 'డిలావేర్ వీక్లీ' జరిపిన పోటీకీ మా దానికీ పోలిక ఎక్కడ? బహుశా అక్కడి ప్రజ వేరేమో! మాకు అందుబాటులో వున్న యావన్మంది ఆర్కాయివ్ పత్రిక పేరు విన్నారు; చాలామంది చందాదారులుగా చేరారు. అంతకంటె ఏం కావాలి? కొత్త మిషన్ కావాలనుకోండి - అదే వేరేసంగతి.

# 17

బాబ్ డిలావేర్ వెళ్ళి, చందాలపోటీ గురించి తెలుసుకువచ్చినప్పట్నుంచీ, మేము పదహారు పేజీల పత్రిక ప్రచురిస్తున్నాం.

బాబ్ ఒకసారి రాశాడు ఈ సంగతి. అతని మాటలోనే - చెబుతాను :

అచ్చు మిషనుల ధనధన, టైప్‌రైటర్ల టకటక సంగీతం పాడుతూండగా, రాబందు ముక్కుగల ఒక పొడుగుపాటి అతను, వుబ్బిన లోలుసంచీ పుచ్చుకు, తిన్నగా నా టేబుల్ దగ్గిరకివచ్చి నా ముక్కుకి సూటిగా తన విజిటింగ్ కార్డు వుంచాడు.

నేను రాస్తున్నది ఆవారం పత్రిక మొదటి పేజీలోనికి ముఖ్యమైన శీర్షికవ్యాసం. అప్పటికప్పుడే పదిహేనుసార్లు, నన్ను అయినవాళ్లూ కానివాళ్లూ పలకరించారు. అమెరికా ప్రభుత్వపు కార్మికశాఖకి చెందిన "వేజ్ అండ్ అవర్ డివిజన్ (Wage and Hour Division) ఉద్యోగస్థుణ్ణి" అని అతను చెప్పుకోవడం, కాస్త పరధ్యానంగా విన్నమాట నిజమే!

"అలాగే - అలాగో. బావుంది బావుంది" అంటూ అతన్ని మా పీటర్స్ దగ్గిరికి తీసుకువెళ్లాను. పీటర్స్ రయిల్వేల్లో ఏభై ఏళ్లు పనిచేసి, రిటైరై ఇప్పుడు మాదగ్గిర అకవుంటెంట్ గా ఉంటున్నాడు.

పత్రికకి రాయవలసిన ముఖ్యవిషయం వ్రాయడం అయిపోయాక, తలఎత్తి చూస్తునుగదా, ఆ ఉద్యోగస్థుడు మాపుస్తకాలు పరిశీలించి, మహా ఆతురతగా రాసుకుంటున్నాడు ఏమిటో నోట్స్. ఆవిషయం పీటర్స్ చూసుకుంటాడు - నాకెందుకు? - అని నా పని ధోరణిలో పడిపోయాను.

కొద్దిసేపయాక ఆఉద్యోగి నాదగ్గిరికొచ్చి, నన్ను కొన్ని ప్రశ్నలు వేస్తానన్నాడు. సరే నన్నాను.

"ఈ ఛెస్టర్ వాలీప్రెస్ సంస్థకి అధ్యక్షుడైన మిస్టర్ మెక్లవిన్ గానీ, ఉపాధ్యక్షురాలైన మిసెస్ మెక్లవిన్ గానీ ఏమీ జీతం తీసుకుంటున్నట్టు కనిపించదే!"

"లేదు - తీసుకోవడంలేదు. అది కొద్దిగా విచారించదగ్గ సంగతే

గాని కంపోజిటర్లకీ యితర పనివారలకీ జీతాలిచ్చేసి, బాంక్ కి ప్రతి నెలా కట్టవలసిన వడ్డీ కట్టేసినమీదట దమ్మిడీ మిగిలితేగా, మేము తీసుకునేందుకు? ఏనెల కానెల లోటుబడ్జెటే (Deficit) అవుతోంది. మేముకూడా నాలుగుడబ్బులు తీసుకోగల మంచిరోజుకోసం ఎదురుచూస్తున్నాం" అన్నాను సాయలాపాయలాగా.

నేను నవ్వుతూ చెప్పానుగాని ప్రభుత్వోద్యోగి మొహంలో చిరునవ్వుఛాయ ఎక్కడా కనపడలేదు. "లా ప్రకారం, యిటువంటి కంపెనీలో, అధ్యక్ష ఉపాధ్యక్ష హోదాలో వున్నవారు, గంటకి నలభై సెంట్లు కనీసవేతనం పుచ్చుకుంటూ వుండాలి; ఓవర్ టైము అయితే అరవై సెంట్లు," అన్నాడతను నిక్కచ్చిగా.

నేను చెబుతున్నది అతను పొరబాటుగా అర్థంచేసుకుంటున్నాడని గ్రహించి నేనూ నాభార్యా ఆఫీసులో పనివారలం కాదనీ, కంపెనీషేర్లలో నాలుగింట మూడొంతలు మావేననీ, అంచేత మేము జీతం పుచ్చుకున్నా పుచ్చుకోకపోయినా, ఒకటేననీ వివరించబోయాను.

"కంపెనీలో పనిచేసే ప్రతిఉద్యోగీ, లాప్రకారం, వేజ్ అండ్ అవర్ ఆక్టు (Wage and Hour Act) కి లోబడి జీతం పుచ్చుకోవలసిందే!" అన్నాడతను.

మిషన్ మీదకి వెళ్లవలసిన ఫారాలు అక్కడ నాకోసం కనిపెట్టుకున్నాయి. ఆ సంగతి మర్చిపోయానుకూడా.

"అక్కడ డబ్బులేకపోయినా మాకు మేముజీతం యిచ్చుకోవాలా? అయితే, ఎవరిదగ్గిరయినా అప్పుచేసి, మాజీతాలు మేము పుచ్చుకుంటూ వుండాలన్నమాట. అప్పు జేసేందుకుకూడా మాకు యింక అప్పుపెట్టే అవకాశంలేదు."

"నేను అలా అనడంలేదు, లాప్రకారం చెప్పాను. మీ వ్యాపారం లోని బలువు సులువులు మీవి – మధ్యని నాకెందుకు ?"

ఇంతలో యిరవైఆరుగురు పిల్లలు హోలోమంటూ లోపలికి వచ్చారు. ఏడూ పందొమ్మిదేళ్ల మధ్యనున్న పిల్లలు వాళ్లందరూ. "మడిచేందుకు కాయితాలేమయినా వున్నాయా యివ్వాళ ?" అని వాళ్లు అడిగేటప్పటికి, ప్రభుత్వోద్యోగికి తన చేతిలోవున్న పెన్సిల్ గుటుక్కున మింగినట్టయింది,

కాస్త తేరుకుని "ఎవరువాళ్లు ?" అన్నాడు.

మేము తడవకి రెండు పేజీలుకంటె ఎక్కువ ఎలాప్రింటు చేయలేమో, అలా రెండేసి పేజీలచొప్పున ప్రింటు చేస్తున్నప్పుడు మడవడం అనేది ఎలా తప్పనిసరి అవుతుందో, ఆ మడిచేందుకు స్కూలు పిల్లలు వాళ్ల ఆటల సమయంలో మాదగ్గిరికివచ్చి ఆడుతూ పాడుతూ ఎలా మడిచిపెడతారో, అటువంటి పనిచేస్తున్నప్పుడు వాళ్లు ఎంత సరదాగా వుంటారో – అదంతా ఆ ప్రభుత్వోద్యోగికి చెప్పాను.

"వాళ్లు యిక్కడ కూచున్నప్పుడు కుదురుగా కూచుంటారు. మేము వాళ్లకి ఒక రకమైన క్రమశిక్షణ నేర్పుతున్నాం–తృణమో పణమో జేబులో పడుతుందనే ఆశతో, వారది నేర్చుకుంటున్నారు," అంది నా భార్య అక్కడికొచ్చి.

కాని ప్రభుత్వోద్యోగికి మా మాటలు వినిపిస్తున్నట్టు లేదు. దగ్గర్లోవున్న కుర్రవాణ్ణి ఒకడిని పిలిచి క్రాస్ పరీక్ష మొదలెట్టాడు. మిగతా వారు చల్లగా జారుకుందామని చూశారు. కాని, అతను వారిని భయపెట్టి, "ఎక్కడి వాళ్లు అక్కడ వుండండి–కదిలితే వూరుకోను"–అన్నాడు. ఏవో ఫారాలు సంచిలో నుంచి బయటికితీసి, వాటి మీద వాళ్ల పేర్లూ, వయసూ, తలిదండ్రుల భోగట్టా–యిలాంటివి

రాసుకున్నాడు. "వాళ్లందరూ తమ వయసులు చెప్పారు గదా- ఎందుకు వాళ్లని అలా హడల గొడతారు?" అన్నాను.

తొందర తొందరగా కాయితాలమీద బరుకుతూ, "పదహా రేళ్లలోపు పిల్లలచేత పని చేయించడం చట్ట విరుద్ధం. వాళ్లు చెబుతున్న వయసు నిజమో అబద్ధమో నని ఈ దరియాప్తు చేస్తున్నాను," అన్నాడు.

"చట్ట విరుద్ధం అయితే మానిపిస్తాం. పాపం, వాళ్ల పేర్లు ఎందుకు రాసుకోవడం మధ్య?" అన్నాను

"వాళ్లు చెప్పినది నిజమో అబద్ధమో వాళ్ల స్కూళ్లకి యిళ్లకి వెళ్లి కనుక్కో వద్దా మరి?"

రెండు రోజుల అనంతరం స్కూలు అధికారి దగ్గర్నుంచి టెలి ఫోన్ వచ్చింది. "మాకు అర్థం కాకుండా ఉంది. ఎవరో ప్రభు త్వోద్యోగి వచ్చి స్కూలు పిల్లల రికార్డు లన్నీ, మొదటి నుంచి చివరి దాకా తిరగే యిస్తున్నాడు. ఎక్కడెక్కడి పాత కాయితాలు బయ టికి తవ్వవలసొస్తోంది. యింటర్వ్యూ చేయాలని వాళ్లని క్లాసులో నుంచి పిలిపిస్తున్నాడు. ఇదంతా మాకు అర్థం కాకుండా ఉంది. నిమ్మకి నీరోసినట్లు మీ రక్కడ నిశ్చింతగా కూచుంటే ఎలా?"

స్కూలు టీచర్లకీ, స్కూలు పిల్లలకీ, స్కూలు అధికారికీ రెండు రోజులు పని చెప్పాడు ఈ ప్రభుత్వోద్యోగి. ఎంత టైము నిరుపయోగ మైన కార్యక్రమంలో, వృథా అయిందో, చెప్పడం అనవసరం.

ఆ రెండు రోజులూ మమ్మల్ని వొదలిపెట్టి, మళ్లీ మూడో రోజుకి మా దగ్గరికి తయారయాడు. పెట్టీ కాష్ వోచర్లు ఒక గుప్పెడు పుచ్చుకు, మేనేజరు రసెల్ని అవి ఏమిటో వివరించ మన్నాడు. "8 డాలర్లు-బుచ్; 75 సెంట్లు-రెడ్" ఈ ధోరణిలో వున్నాయి ఆ పెట్టి కాష్ వోచర్లు. ఇవేవో జూదపు రశీదులను కున్నట్టున్నాడు.

చ్చి ప్రోగ్రామ్ కాయితాలు తొందరగా ప్రింటు చేయించే హడావుడిలో వున్న రసెల్, అవి బైండర్ బాయిస్‌కి యిచ్చిన బాపతు- అన్నాడు.

అంతటితో, ఆ ప్రభుత్వోద్యోగి పరిశోధనలో నూతనాధ్యాయం ప్రారంభ మయింది. నిజానికి ఆ బుచ్ లూ, ఆ రెడ్ లూ ఎవ రెవరో మాకు తెలియదు. ఎవరో, వాళ్లకి తెలిసిన వాళ్లతో వచ్చి, రెండు మూడు గంటలు పనిచేసి, నాలుగు డబ్బులు సంపాయించుకు వెళ్లిపో తూండేవారు. వాళ్ల వూరూ పేరూ మాకెలా తెలుస్తుంది గనక! వాళ్లు పని చేసేవారు, మేము ఆ పనికి తగ్గ ప్రతి ఫలం యిచ్చి పంపించేం.

ప్రభుత్వంవారి మనిషికి మా పద్ధతి ఎంత మాత్రం నచ్చలేదు. ఆ బుచ్ లూ, రెడ్ లూ స్కూలు పిల్లలలో కొందరై వుండ వచ్చునని అతనికి తోచింది. సుస్పష్టమైన పేర్లు లేని వాళ్లందరూ స్కూలు పిల్లలై వుండవచ్చుననుకున్నాడు. కొందరిని తను యింటర్వ్యూ చేశాడు. ఇంటర్వ్యూ చేయడానికి వీలు కాని వారికి, "అతి రహస్యం: యజమానికి చూపవద్దు" అను ప్రభుత్వ ప్రశ్నా పత్రాలు (Questionnaires) పంపించారు. (" Confidential. Do not show to your employer ")

ఒక రోజు సాయంత్రం, నేను యింటికి నడిచి వస్తూంటేగా, మందుల షాపు దగ్గర పది పదిహేనుగురు స్కూలు పిల్లలు, గుంపుగా కనిపించారు. "బాబ్, బాబ్- దీన్ని నేను ఏమి చేయాలి?" అంటూ ప్రభుత్వ ప్రశ్నాపత్రం చూపించాడు ఒక అబ్బాయి. ఆ పత్రంలో నలభై ప్రశ్నలు వున్నాయి. తేదీ, జన్మస్థలం, తల్లి పేరు, తండ్రి పేరు, తల్లి పుట్టింటివారి పేరు, వయసు, తను ఎన్ని గంటలు నౌకరి చేస్తున్నది, ఎంత ముట్టుతున్నది-యిత్యాది ప్రశ్నలు వున్నాయి ఆ పత్రంలో.

ఆ అబ్బాయి పేరు రెడ్. అప్పుడే మందుల షాపులో నుంచి బయటికి వచ్చాడు. వారానికి అయిదు రోజులు (సాయంత్రం వేళ స్కూలు కట్టేశాక) మందుల షాపులో పని చేస్తూంటాడు. యింకా రెండు రోజులూ గానీ, ఒక రోజు గానీ మా దగ్గరికి వచ్చి మడత పని చేసి వెళుతూంటాడు. చంద్రమండలంలో లీప్ యియర్లు వున్నాయా లేవా అని వాదించుకుంటూ కాయితాలు మడవడం, పని అని ఎలా అనిపించు కుంటుంది? - అంటాడా కుర్రవాడు.

“ఎంత ముట్టుతోంది?” అను ప్రశ్నకు ఎదురుగుండా “75 సెంట్లు” అని రాయమన్నాను. రెడ్, 75 సెంట్లు-ఆ సోచరు సంగతి జ్ఞాపకం వుంది యింకా! అందు కని వెంటనే చెప్పెయ్య గలిగాను.

ఇంక, ఆ రోజు నుంచి చాలా మంది కుర్రవాళ్లు, “ఈ ప్రభుత్వ ప్రశ్నా పత్రాలు ఎలా పూరించాలి?” అని మా ఆఫీసుకి వచ్చారు. అందరికీ చెప్పాను. లా ప్రకారం నేను యిప్పుడు గంటకి 60 సెంట్లు కనీస వేతనం ఇచ్చుకోవాలి? కాని డబ్బేది?

ఈ పరిశోధనా పరిణామం నాలుగు నెలల అనంతరం గాని మాకు తెలియలేదు.

గంటలూ జీతాలూ మనిషి (Wages and Hours Man) మమ్మల్ని వుక్కిబిక్కిరి చేశాడు. కష్టాలుగట్టెక్కి ఒక దరికి చేరుకుంటున్నాం గదా అనుకునే వేళకి, చిన్నవ్యాపారాలకి సహాయం చేస్తామని పెద్దఖబుర్లుచెప్పే ప్రభుత్వమే మాకు ఎసరుపెట్టింది. మేము చట్టాన్ని అతిక్రమించిన మాట నిజమే - కాని, యిటువంటి చట్టం వుంటుందని కూడా మేము అనుకోలేకపోయాం. తెలియక చేసిన నేర

మని, యికముందు అలాటిది జరగదనీ పరిశోధనాధికారికి చెప్పుకున్నాడు బాబ్. ప్రభుత్వోద్యోగి ఆరోపించినట్టు చైల్డ్ లేబర్‌లా (Child Labor Law) ని మేము పని గట్టుకు ఉల్లఘించ లేదనీ, చిన్నపిల్లలేదో ఆడుతూ పాడుతూ మాకు సాయంచేశారుగాని, అంతకంటె మరింకేమీ లేదనీ కూడా చెప్పుకున్నాడు బాబ్.

ఆర్థికంగా మేము ఫోల్డింగ్ మిషన్ కొనగలస్థితిలో లేము. కాని, ప్రభుత్వంవారికోసం, మేము తప్పనిసరిగా కొనవలసివచ్చింది. మార్గాంతరంలేదు,

# 18

మర్నాడు ఉదయమే, డవునింగ్‌టవున్ నేషనల్ బాంక్ మేనేజరు దగ్గిరికి వెళ్ళి-"ఆరువేల డాలర్లు కావాలి" అన్నాడు బాబ్.

"ఎందుకు?" అన్నాడు మేనేజరు బాల్డ్‌విన్.

"ఒక కొత్త మిషను కొంటున్నాను."

"నిరుడేగా కొన్నది? మళ్ళీ కొత్తది ఎందుకు అప్పుడే?"

"నిరుటికీ ఈ ఏడుకీ మేము బాగా పెరిగిపోయాం. ఇప్పుడు మేము కొనదలుచుకున్నది నిజమైన ఆటోమాటిక్ ప్రెస్. ప్రింట్‌చేయడమే కాకుండా, మడవడం కూడా చేస్తుంది ఈ ఆటోమాటిక్."

బాల్డ్విన్ మరికొన్ని ప్రశ్నలు వేశాడు. ఒకసారి అకవుంట్లు సెక్షనులోకి వెళ్ళివచ్చి, బాబ్‌ని అప్పు ఎందుకు కావాలో సహేతుకంగా కాయితం మీదరాసి, యివ్వమన్నాడు. బాబ్ రాసియిచ్చాడు.

డైరెక్టర్లు పదకొండుగంటలకి కలుసుకుంటారు. వాళ్లు చాలా చాలా ప్రశ్నలు అడుగుతారు, ఫలితం ఏమయినదీ మధ్యాహ్నం రెండుగంటల తర్వాత చెప్పగలుగుతాను,'' అన్నాడు బాల్డ్విన్.

మధ్యాహ్నం రెండుగంటలకి బాబ్ బాంకుదగ్గరికి వెళ్లేటప్పటికి యింకా అమీతుమీ తేల్లేదు. ''ఇంకొంచెం సేపు పడుతుంది – ఫలితం తెలిసేందుకు'' అను సందేశ దృక్కులతో చూశాడు బాల్డ్విన్ బాబ్‌ని.

ఆఖరికి బాబ్ బాల్డ్విన్ టేబుల్ దగ్గరికి వెళ్ళాడు. టేబులుమీద వున్న కాయితాలలోకి చూస్తూ, ''ష్యూరిటీగా ఏమివ్వగలరు?'' అన్నాడు బాల్డ్విన్.

''నాకు వున్న ప్రెస్.''

బాల్డ్విన్ ఒకసారి అకవుంట్ సెక్షన్‌లోకి, ఒకసారి లెడ్జర్ సెక్షనులోకి వెళ్ళివచ్చి అన్నాడు. ''సగం పైకానికి మీ ప్రెస్ పనికొస్తుంది. మిగతా సగానికి మరొకటి ఏదైనా వుండాలి. మీ అమ్మగారి దగ్గర యేమైనా పేర్లు

వుంటే అవి గాని, మీ ఆవిడ యేదైనా పుస్తకం రాసి అమ్మి వుంటే, అదిగాని...’’

అవును, నేనొక పుస్తకం రాశాను. ఊపిరి పీల్చేందుకు టైములేకపోయినా, కష్టపడి రాశాను. జూనియర్ లిటరరీ గిల్డువారు దానిని ఆమోదించారు. దాని తాలూకు యడ్వాన్సుకూడా అందింది. ఇటు నా పుస్తకం, అటు వాళ్లమ్మగారి దగ్గరవున్న కొద్దిపాటి షేర్లు – ఈరెండూ కలిసి కాపాడాయి మమ్మల్ని. మాకు స్తోమతు లేదు మొర్రో అంటున్నా, – ప్రభుత్వం మాచేత ఆటోమాటిక్ మిషను కొనిపించింది.

వర్జీనియా రాష్ట్రంలోని నార్ఫోక్ లో వుంది ఆ మిషను. దానిని అక్కడ విప్పడం, తుడవడం, లారీల్లోకి ఎక్కించడం, ఇక్కడ అయిదడుగుల లోతుగల కాంక్రీటు గొయ్యి తవ్వించడం – అంతా హడావిడే ఆ రోజుల్లో. తలకి మించినపనులు ఎన్నివున్నప్పటికీ ఏవారం పత్రిక ఆ వారం, టంచన్ గా వెలువడుతూండేది. ఆ మూడువారాలూ చాలా యడ్వర్టయిజ్ మెంటులు వుండేవి.

బాబ్, రసెల్, మాకు అచ్చుపరికరాల విషయంలో సలహాలిచ్చే బెన్, మా ప్రింటింగ్ మేనేజరు ఎడ్, తొమ్మండుగురు పనివాళ్ళు – యింతమంది వెళ్లారు నార్ఫోక్ ఆ ఆటోమాటిక్ ని తర్లించటానికి వచ్చారు [illegible] పన్నెండు

టన్నుల ట్రయిలర్ ట్రక్కులో పట్టుకొచ్చారు దాన్ని. సోమవారం ఉదయం ఆ యంత్రం తాలూకు యిరవై రెండు వేల విభాగాలూ అశ్వశాలలో నాలుగుమూలలా పేర్చారు.

"ఇవన్నీ విప్పేసి తీసుకొచ్చి, వేటికవి మళ్లీ బిగించడం శ్రమవేస్తుకాదా?" అని అడిగాను బాబ్‌ని. అది అర్థరాత్రివేళ. పనివాళ్లు ఒక్కొక్కళ్ళే తప్పుకుంటున్నారు.

గ్రీజు చేతులతో వున్న బాబ్, ముంజేతితో మొహం తుడుచుకుంటూ, ఫక్కున నవ్వాడు నా మాటలకి.

# 19

మూడు వారాల అనంతరం మా ఆటోమాటిక్ అశ్వశాలకి అందాన్ని యిచ్చింది. ఆటోమాటిక్ మహా మంచిది. గంటకి అయిదువేల కాపీలు చక్కగా మడిచి బయట పడేస్తుంది. రెండేసి పేజీల బెడద మాకు వొదిలిపోయింది.

బుధవారం నాటికి ఎనిమిది పేజీల ఫారం పూర్తిచేసి, ఆటోమాటిక్‌కివున్న రెండు బెడ్స్‌మీద, చెరోచట్రం సున్నితంగా ఉంచాం. ఈ కొత్త మిషనులోనుంచి పేపర్లు ఎలా వస్తాయో చూదామని డెబ్భయి ఎనభైమంది గుమిగూడారు.

ఎలక్ట్రిక్ మోటారు 'కర్ - కర్' అని తిర

గడం మొదలెట్టింది; గేర్లు రకరకాలుగా మార్చబడ్డాయి; ఇంతలో ఏదో కాయితపు సంచి నేలమీద పడ్డ శబ్దమయింది. చుట్టలావుండే న్యూస్ ప్రింటుని మిషన్‌లోకి పట్టుకొచ్చే యంత్ర విభాగంలో ఏదో పొరపాటు వుండటంవల్ల, తఖీ మని తెగింది. ఈ కాయితపు చుట్టని ఒకదారిలోకి తీసుకు వచ్చేందుకు బాబ్, రసెల్, ఎవ్ ముగ్గురూ అరగంట సేపు కష్టపడ్డారు. అరగంట అయాక, మిషన్‌ని మళ్లీ వొదిలి పెట్టారు.

కాయితపు చుట్ట తెగడం, ఈ తెగినది సవరించేం దుకు అరగంట పట్టడం, యిలా నాలుగుసార్లు కాయితపు చుట్ట తెగడంతో, రెండు గంటల కాలం వృథా అయింది.

హితవు కానప్పటికీ, అప్పుడొక నిశ్చయానికి రాక తప్పింది కాదు, ఆవారం పత్రిక విడుదలవాలనివుంటే, రెండు పేజీల పాతమిషనుని నమ్ముకోవడమే మార్గం.

మరుసటి వారం, ఆటోమాటిక్‌కి మరొక ట్రయిల్ యిద్దామనుకున్నాం. అంతా సక్రమంగా, సవ్యంగానే సాగింది. కాయితం ఎక్కడా తెగకుండా, కాయితం చుట్ట లోనుంచి చక్కగా వస్తోంది మిషనులోకి అందరం మిషన్ చుట్టూనుంచుని, దానికి వొంగి వొంగి సలాములు చేశాం.

ఆపైన, పత్రిక ఎలా ప్రింటవుతోందో చూదామని ప్రింటయిన కాపీ పేజీలు తిరగేశాం. ఘోరం — మహా

ఘోరంగా ఉంది. కొన్ని పేజీలమీద అక్షరాలే లేవు; మరికొన్ని పేజీలమీద సిరాముద్దలు. పేజీలమార్జినులు మనసి భయపెట్టేటట్టు వున్నాయి. కొన్నిటికి తలా భాగం లేదు; కొన్ని అయిమూలలుగా వున్నాయి. ఒక్క టేమేలు. పేపరు మట్టుకు తెగడం లేదు; కాయితపు చుట్టలోనుంచి మిషనులోకి సక్రమంగా వస్తోంది. అచ్చుపరికరాల విషయంలో మాకు సలహాచెప్పేవాన్, పేపరు తెగకుండా వుండటం. ప్రస్తుతానికి ఘనవిజయంగా చెప్పుకోవచ్చు నన్నాడు. చిన్నచిన్న సర్దుబాటులతో మార్జినులు మన మాట వింటాయి - అని ధయిర్యం చెప్పాడతను.

మార్జినులు సరిగా దిద్దుకునే లోపున 900 కాపీలు అచ్చయి పోయాయి. చూస్తూచూస్తూ వాటిని పారె య్యడం యిష్టం లేక, అందులో కొన్ని పోస్టుచేసేశాం కూడాను - చందాదారులూ అడ్వర్టయిజర్లూ మాపట్ల ఆమాత్రం కనికరం చూపకపోతారా?-అను ధయిర్యంతో.

ఆవారానికావారం, మాఆటోమాటిక్ ఒక దారిని పడ నారంభించింది. వరసని ఆరువారాలు, కాయితం తెగ కుండా వుండేటప్పటికి, మాకెంతో సంతోషమేసింది. పూస్తే సిరాపూత వుయ్యడం, లేకపోతే అక్షరంముక్క కనిపించ కుండా పోవడం - ఈ జబ్బుమట్టుకు ఏడాదిపాటు వుంది. మా చందాదారులూ, యడ్వర్టయిజర్లూ మట్టుకు మా ఆటో మాటిక్ అవకతవకల్ని ఓర్పుతో సహిస్తూవచ్చారు.

ఆటోమాటిక్ పేరు రూంబ్. ఈ రూంబ్ మమ్మల్ని ముంచుమించు మింగేసింది. దాని ఖరీదు, దాన్ని అక్కడ నుంచి యిక్కడికి రాజమర్యాదలతో తీసుకురావడం. అయిదడుగుల కాంక్రీట్ పిట్, కొత్త భాగాలు. కొత్త వైరింగ్. — మొత్తం ఎనిమిదివేల డాలర్లు తన పొట్టనెట్టుకుంది. దీన్ని నడిపించేందుకుగాను మరొక ఆరువేల డాలర్లు అప్పుచేశాం. 1871 లో జోసెఫ్ పులిట్జర్ మొట్టమొదటి రోటరీ ప్రెస్ స్థాపించి. "దీని వెర్రిచేష్టలతో నాకు మతిపోతోంది" అన్నాడు. అతను ఎంత బాధపడి ఆమాట అనివుంటాడో. మాకు తెలిసొచ్చింది.

## 20

గంటలూ జీతాలూ మనిషి, చందాదారులపోటీ. ఈ రూంబ్ దేవతని కొనితెచ్చిపెట్టుకోవడం, డబ్బు బాకీలూ వీటితో మాకు మనస్తిమితం లేకుండా పోయింది. వెనకటి రోజుల్లో మేము యిబ్బందుల్లో వున్నామంటే, విధి మమ్మల్ని కరుణించి చల్లని చూపుచూసేది. ఇప్పుడు మేము ముందు వెనుకలు తెలియని అగాధంలో పడిపోయాం.

ప్రభుత్వ విచారణ అయిన మరుసటి వారంలో, బాబ్ తన సంపాదకీయంలో, ఈ అనుభవాల గురించి రాశాడు. చాలామంది మాపట్ల సానుభూతి కనబరిచారు.

వ్యాపారస్తులు కొందరు మా ఆఫీసుకొచ్చి, వారివారి అనుభవాలు మాకు నివేదించారు. అది స్థానిక విషయమే కావచ్చు; కాని దేశమంతటికీ తెలియవలసినది కొంతవుంది అందులో.

"ఒక మాగజైన్ ఆర్టికల్ రాయకూడదా?" అని అడిగాను బాబ్‌ని.

రాయడమంటే నొప్పులు పడతాడు బాబ్; మూలుగుతాడు, గునుస్తాడు, ఎవరినో వుద్ధరిస్తున్నట్టు భావిస్తాడు. సిగరెట్టు ముట్టించి, కాయితం వంక దీనంగా చూస్తాడు. రాయడం తప్పించుకునేందుకు ఎన్ని మార్గాలు వున్నాయో అన్నీ వెతుకుతాడు.

చందాదారులపోటీ, ఆటోమాటిక్ కొనడం – వీటితో అతనికి మాగజైన్ ఆర్టికల్ రాసేపాటి స్తిమితం లేక పోయింది. 1950 జనవరిలో ఒకరోజు పొద్దుట, పక్కమీద నుంచి లేస్తూ, "ఇప్పటికి ప్రాణం కుదుటబడింది. అది రాత్రి పంపించేశాను," అన్నాడు.

"ఎప్పుడు రాయగలిగావ్? అర్ధరాత్రి దాకా నేను ఆఫీసులోనే వున్నానాయె! అప్పటికి నువ్వింకా చేతులనిండా క్రీజుతో వున్నావ్!"

"మొట్టమొదట చేతులు కడుక్కున్నాను. ఆపైన టైప్‌రైటర్ దగ్గర కూచున్నాను. సిగరెట్టు కూడా వెలిగిం

చలేదు. గంటన్నర తర్వాత టైప్‌రైటర్ దగ్గర నుంచి లేచాను. రాసినది ఒక కవరులో పెట్టి, స్టాంపు అంటించి, వస్తూవస్తూ పోస్టుడబ్బాలో అది పడేసి, యింటికొచ్చిస్నానం చేసి, పక్కమీద పడ్డాను.

"టైపు తప్పులుగానీ, స్పెల్లింగుతప్పులుగానీ వున్నాయేమో చూడను కూడా లేదా ?"

"ఆ బాధ కూడా ఎందుకు ? సాటర్‌డే ఈవినింగ్ పోస్టునుంచి తిరిగివచ్చాక చూసుకోవచ్చు."

రెండురోజుల తర్వాత మా హూబు (ఆటొమాటిక్)కి కొత్తజబ్బుపట్టుకుంది. ఆ జబ్బుకుదిర్చేందుకు బాబ్ పిట్‌లోకి వెళ్లాడు. ఇంతలో పోస్టమాన్ ఉత్తరాలు తీసుకొచ్చి యిచ్చాడు.

"బాబ్, బాబ్ !" అని అరిచాను.

"ఏమొచ్చింది?" అన్నాడు – హూబు కాళ్లదగ్గర వున్న బాబ్.

"ఇదిగో, సాటర్‌డే ఈవినింగ్ పోస్టు దగ్గర నుంచి ఉత్తరం."

"నువ్వు తెరు. దానిలో నుంచి తేళ్ళూ పాములూ రావుగా" అన్నాడు.

వణుకుతున్న చేతులతో కవరు చించాను. లోపలి ఉత్తరం చదువుతున్నప్పుడు, నా కళ్ళని నేను నమ్మలేక పోయాను. గంటలూ జీతాలూ మనిషి గురించి బాబ్ రాసిన ఆర్టికల్ వారు అచ్చువేస్తున్నారు. చెక్కు మరుసటి పోస్టులో వస్తుంది.

“వాళ్ళు నా ఆర్టికల్ వేస్తున్నారు” అన్నాను మహా దానందంతో. ప్రెస్‌లో ఉన్న వాళ్ళందరికి వినిపించివుంటుం దేమో కూడా - అంత బిగ్గరగా అన్నాను.

వంగి, ఏవో మరలు బిగిస్తున్న మనిషి నిటార్గా నిల బడి “ఏమిటీ!” అన్నాడు. ఆ ఆర్టికలు అచ్చు అవుతోం దంటే, అందరికీ ఎంత సంతోషమో చెప్పలేను. సాటర్ డే ఈవినింగ్ పోస్టు ధర్మమా అని, ఆ వారం పనివారికి యివ్వవలసిన పైకానికి, తడుముకోనక్కర్లేకపోయింది.

“నన్ను పట్టించిన కేంద్రోద్యోగులు” (The Federal Snoops Are After Me) అనుశీర్షికతో 18-3-1950 సాటర్ డే ఈవినింగు పోస్టులో బాబ్ ఆర్టికలు పడింది. అదే సంవత్సరపు అక్టోబరు రీడర్స్ డైజస్టులో పునర్ముద్రిత మయింది. ప్రపంచంలోని నలుమూలలనుంచి, ఆర్కయివ్ పత్రిక ఎడిటర్ పేర, ఏడువందల ఉత్తరాలువచ్చాయి. అమెరికాలోని ప్రతిరాష్ట్రంలోని కంట్రీ ఎడిటర్లు మాకు

రాశారు. వార్తాపత్రికలూ, మాగజైనులూ ఈ విషయమై సంపాదకీయాలు రాసి, వాదప్రతివాదాలు సల్పాయి.

ఫిలడిల్ఫియాలో హాజరు కావలసిందని బాబ్ కి ఉత్తరువు వచ్చింది. మాకు లోగడ రావలసిన 745 డాలర్లూ ఇపుడు రావలసిన 582 డాలర్లూ కంపెనీ అకవుంటుల్లో నుంచి తీసుకోవలసిందిగా అధికారులు ఆర్డరు జారీచేశారు. మేము తీసుకోమని భీష్మించుకు కూచున్నామా? కంపెనీ అకవుంట్ లో ఏ నాడన్నా అంత మొత్తం వున్న మీదట గదా మేము తీసుకోవడమనేది!! ఏమయితేనేం, గంటలూ జీతాలూ మనిషి ఒకవిధంగా మాకు ఉపకారమే చేశాడు. వందల సంఖ్యలో వచ్చిన ఆ ఉత్తరాలు మాకు నూతనశక్తిని, ధయిర్యాన్ని యిచ్చాయి. ఆర్కాయిన్ పట్ల మాకు వున్న విశ్వాసం ద్విగుణీకృతమయింది.

## 21

ఒక్కొక్కప్పుడు అర్ధరాత్రి అయిపోతుంది. బాబ్, నేనూ టైప్‌రైటర్ల ముందుకూచుని వుంటాం. చెల్లించవలసిన బిల్లులు, వెళ్ళవలసిన మీటింగులు, చూడవలసిన కాగితాలు మమ్మల్ని భయపెడతాయి.

మూడువందల డాలర్ల ప్రింటింగ్ బిల్లు యివ్వవలసిన మనిషి అయిపూ ఆనవాలూ లేకుండా పారి

పోయాడు. జాక్ హిక్స్‌కి విత్తనాల కేటలాగు ప్రింట్ చేసి యిచ్చాం; కాని, వాళ్ల పెద్దబ్బాయి పోలియో Polio) తో హాస్పిటలులో వుండగా, ప్రింటింగ్ బిల్లు ఎక్కడ చెల్లించగలడు? బాంక్ వారి దగ్గిర అప్పుతీసుకున్న పైకం తాలూకు వాయిదా మర్నాడుకట్టితీరాలని పీటర్స్ జ్ఞాపకంచేసి వెళ్ళాడు సాయంత్రం. అబ్బాయికి చెప్పుల జత కొని తీసుకొస్తానన్నాను; కాని, మధ్యాహ్నంవేళ ఆ సంగతే మర్చిపోయాను. వెలాడే దీపకాంతికింద మేమిద్దరం. ఇలా వున్నాం. సుఖపడుతున్నామా?

అంటే సమాధానంలేదు. కాని, న్యూయార్క్ టైమ్స్ ఎడిటరుగా వుంటారా అన్నా, బెత్లెహెమ్ స్టీలు కంపెనీ ప్రెసిడెంట్‌గా వుంటారా అన్నా – ''వద్దు బాబూ మాకు!'' అని నిస్సంకోచంగా అంటాం. ''విజయం (Success) అనేది సామాన్య సుగుణాలని అభ్యసించడంవల్ల వస్తుంది – కష్టపడి పనిచెయ్యడం, తెలివితేటలు, ఉత్సాహం, ఆత్మవిశ్వాసం, నిజాయితీ – ఈ అయిదూ వుండాలి,'' అన్నాడు యడాల్ఫ్ ఓక్స్. ''కంటినిండా నిద్రపోవడం నేను ఎరగను,'' అంటాడు హెచ్. యల్. మెన్‌కెన్. ఉదయం 10 గంటలనుంచి రాత్రి 2 గంటలదాకా పనిచెయ్యడమే, జోసెఫ్ పులిట్జర్ అఖండవిజయానికి మూలకారణం.

మాకు సంతృప్తిలేకపోలేదు. ఫలానా సంపాదకీయం

బాగుందని ఎవరో పాఠకుడు రాసినప్పుడూ, ఆర్కయిన్ కృషివల్ల తమకి తిండీబట్టా లభించాయని దారిద్ర్యంలో వున్న ఏదో కుటుంబం రాసినప్పుడూ, తనభార్య గయ్యాళితనానికి మందు ఏమిటని అమాయక సంసారి మా దగ్గరకొచ్చినప్పుడూ, ''మా యింట్లో చేసుకున్నాం - మీరు కూడా రుచి చూడండి'' అని పొరుగుమనిషి మా కోసం ఏదో ఆప్యాయతతో తెచ్చిపెట్టినప్పుడూ, తన తోటలో వని ఒక బుట్టెడు యాపిల్స్ తీసుకొచ్చి ఎవరో తోటమాలి మాకు పంచిపెట్టినప్పుడూ, పదేళ్ళకుర్రవాడు రోజుకి పది సెంట్లుచొప్పున పచ్చగడ్డికోస్తూ, అలా యిరవై అయిదు సార్లుకోశాక. వచ్చే రెండుడాలర్ల యాభై సెంట్లతో ఆర్కయిన్ పత్రిక ఒకయేడాదిపాటు తన రోగిష్టితల్లికి సమర్పిద్దామనుకున్నప్పుడూ - మాకళ్ళు చెమ్మగిలక మానతాయా? మేము చేస్తున్నపనిలో మాకు తృప్తి సంతోషం ఎందుకుండవ్ ?

బాబ్ కొన్నివారాలపాటు రూముని బుజ్జగించి, అంతా సరిదిద్ది, పిట్‌లోనుంచి బయటకొచ్చి 'స్విచ్ వెయ్యండి' అంటాడు; - స్విచ్ వేసేటప్పటికి కరెంట్ ఉండదు - అందరికి ఫకాలున నవ్వువచ్చి నవ్వుతాం; ఆటోమాటిక్ లోని ఫోల్డర్లకి సిరాతగిలి, అవి ప్రింటుఅయివస్తున్న పత్రిక లన్నిటికి అలంకారాలు చేకూరుస్తూంటే, నవ్వుకోక చెయ్యగలిగె

దేముంది? దడదడలాడే శబ్దంతో [illegible]తంగా పరువులెత్తే మిషన్. పేపరుని [illegible] బయటికి పడేస్తున్నపుడు, "ఇదిగో యిది మీకు - ఇదిగో యిది మీకు" అంటున్నట్టు ఉండదూ? - ఇలాంటి అపూర్వానుభవాలు విడమరిచి చెప్పడం కూడా కష్టం. సువిశాలమైన ఆ అశ్వశాలకి బ్రహ్మాండమైన హృదయం వున్నట్టూ, ఆ హృదయం ధనధన కొట్టుకుంటున్నట్టూ అనిపించేది. ఎంచేతనే అర్ధరాత్రి అయినా, తిండీతిప్పలు లేకపోయినా, విశ్రాంతి అనే మాటకి వర్ణక్రమం మర్చిపోయినా, మేము చేస్తున్నపనిలో మాకు ఏదో సంతృప్తి కనపడేది.

మరీ నిరుత్సాహం కలిగినప్పుడు ఫిషర్ యామిస్ మాటలు జ్ఞాపకం తెచ్చుకునేదాన్ని. "రాజరికమనేది పెద్ద పెద్ద తెరచాపలుగల చక్కటి ఓడ. దాని నడక మహా దర్జాగా ఉంటుంది. కాని, ఏదైనా రాతికిగాని కొట్టుకుందా, బుడుంగున మునిగి పూరుకుంటుంది. ప్రజాస్వామ్యం తెప్ప (Raft) వంటిది. అది ఎప్పటికీ మునగదు, కాని పాదాలెప్పుడూ నీళ్ళలో ఉంటాయి."

చిన్నవారపత్రికని నడుపుతున్నప్పుడు మనకాళ్లెప్పుడూ నీళ్ళలోనే ఉంటాయి. ఒక్కొక్కప్పుడు ఆ నీళ్లు వేడిగాకూడా వుంటాయి. ఏమయితేనేం, మేము యింతవరకూ మునిగిపోలేదు; యింకా తేలేవున్నాం.



చాలా ప్రేమలు వివాహంతో అంతమవుతాయి. కాని ఈ దంపతుల విషయంలో అలాకాదు. వీరి ప్రేమ వివాహానంతరం ప్రారంభమవుతుంది. ఇద్దరూ కలిసి ఒకే లక్ష్యసాధనకి కృషిచేయడంలో వారి అనురాగలత సువాసనలు వెదజల్లుతుంది.

పట్నవాసపు జీవితానికి అలవాటుపడ్డ జేన్ రాబిన్సన్ లిడ్డుటూ, ...ప్పి. అక్కడ ఒక పత్రిక స్థాపించి, అమాయకులైన ప్రజలందరికీ ఆత్మీయులవుతారు. పత్రిక అంటే స్ట్రీట్ ప్రెయిజు రావచ్చును అనుకుంటుంది జేన్ మొదట్లో; కాని కష్టనిష్ఠూరాలని ఆనందాశ్రువులతో చిలకరించే అపూర్వానుభవమని తరవాత్తరువాతగాని తెలీదు.

ఈ ప్రఖ్యాతకథని యూనివర్సల్ ఇంటర్ నేషనల్ పిక్చర్సు (హాలీవుడ్) వారు సెల్యులాయిడ్‌లో సమర్పించారు. లోరెట్టా యంగ్ జేన్ ట్రేసీ, జాన్ ఫోర్సైత్ రాబిన్సన్ పాత్రని అతి మనోహరంగా నిర్వహించారు.

బొమ్మలు : యూనివర్సల్ ఇంటర్‌నేషనల్ పిక్చర్సువారి సౌజన్యంతో

